## హిందూ రెలిజియస్ యెండోమెంట్సు బోర్డు ఆఫీసు మద్రాసు 6.

సర్క్యులర్.

రానున్న జమీందారీ, యీనాం చట్టము సందర్భమున మఠములు, ఆలయములు, నిర్దిష్టధర్మ సంస్థలు మున్నగు వాటి ట్రస్టీలు, పనరు పైన తెలిపిన చట్టమునకు లోబడునట్టి, సంస్థల భూముల నుగురించి, దిగువ ఫారములో ప్రొగ్రెస్సుకి, తక్షణమే భోస్టుబ్రా పంపవలసినదిగా యీ దువారాలమున కోరబడుచున్నారు.

1. సంస్థ పేరు, ప్రదేశము.
2. జమీందారీలో, సంస్థకు చెందివున్న యావత్తు యీనాం గ్రామములు.
   (a) సంస్థకు, మేలువరం, కుడివరం, రెండునూ చెందిన సందర్భములో ఎకరములు. సెంట్లు. సాలీనా ఆదాయము.
   (i) పల్లం :
   (ii) మెట్ట :
   (iii) మజెకట్ :
   (iv) తోటలు :
   (v) అడవులు :
   (vi) పోరంబోకు లేదా బీడు :
   (b) సంస్థలకు మేలువరం మాత్రమే చెందిన సందర్భమున.
   (i to vi) పైన తెలిపిన (a) మాదిరి.
3. జమీందారీ వెలుపల సంస్థకు చెందివున్న యావత్తు యీనాం గ్రామములు.
   (a) సంస్థకు మేలువరం, కుడివరం, రెండున్నూ చెందివున్న సందర్భములో.
   (i to vi) పైన 2 (a) లో తెలిపినమాదిరి
   (b) సంస్థలకు మేలువరం మాత్రమే చెందిన సందర్భమున.
   (i to vi) పైన తెలిపిన 2 (a)లో మాదిరి.
4. రిమార్కులు.

ఇది అతి జరూరుగా భావించవలెను.

(సం.) వి. బాలకృష్ణన్,
సెక్రటరి.



### నోటీసు

మదరాసు స్మాల్ కాజు కోర్టు
దావా నెం. 2567 of 1947
వాది : జి. రామానుజయ్య శెట్టి.
ప్రతివాది : ఉమ్మిటి రామచంద్రయ్య, మాధరపాకం.

ఇందుమూలముగా తెలియజేయునది దేమనగా: రు 1122/- వసూలునిమిత్తము చేసిన పై దావా చీఫ జడ్జిగారి యెదుట 25-9-1947 తేదిన ఉదయము 11 గంటలకు విచారణకు వచ్చును. ఆ దినము ప్రతివాది హాజరు కానంతట ఎక్సుపార్టి డిక్రీ అగును.

బి. వెంకట్రామయ్య,
వాది అడ్వొకేటు.



## గుంటూరు పంచాంగం

సర్వజిత్ నం॥ భాద్రపద శు॥ సప్తమి 1947 నం॥ సెప్టెం॥ 21 ఆదివారం శు॥ సప్తమి రాత్రి 10-9 జ్యే రా 12-38 శేష వర్జ్యం 6-11.

సో॥ అష్టమి సెప్టెం॥22 సోమవారం శు॥ అష్టమి రా 12 23 నరా రా 3-25 వర్జ్యం 9-34 ల

ఆంధ్రపత్రిక
సర్వజిత్ నం॥ భాద్రపద శు॥ సప్తమి
ఆదివారము

## నూతన విధాన మవసరము

సర్ జఫరుల్లా భారత ప్రభుత్వమును నిందించుచు చేసిన ప్రకటన అసత్యములతో కూడిన దైననూ, దానివల్ల ఒక మంచి కలిగినది. భారత ప్రభుత్వము ఒక ప్రకటన చేయుటకు అవకాశము కలిగించినది.

సర్ జఫరుల్లా బెదరింపులతో పోల్చిన భారత ప్రభుత్వ జవాబు, సీరియస్ గా నున్నదనుటకు సందేహము లేదు. 'పశ్చిమ పంజాబులోని ముస్లిము దురంతములు, తూర్పు పంజాబు; ఢిల్లీ గడబిడలకు కారణమని చెప్పినది. రెండు దేశములను సిద్ధాంత ప్రచారము వాటన్నిటికి మూలమని జ్ఞప్తికి తెచ్చినది. శరణార్థుల రక్షణయొకగాని, వారి ప్రయాణపు సౌకర్యము ఏర్పాటుచేయుటయందుగాని భారత ప్రభుత్వము చూపుచున్నంత శ్రద్ధ, పాకిస్థాన్ ప్రభుత్వము చూపుటలేదని, 14 వ తేదీని పశ్చిమ పంజాబులో కాందిశీకుల దళమును ముస్లిము గుండాలు వచ్చి ముట్టడించుట, 13 వ తేదీన శరణార్థుల రైలుమీద ముస్లిము సైనికులు తుపాకులను కాల్చుట, పశ్చిమ పంజాబు సైనికులు తమ సరిహద్దును దాటి లూటీలు చేయుట మొదలైన కొన్ని ఉదంతములను భారత ప్రభుత్వము పేర్కొనినది.

ఈ ఉదంతములు అసలు జరిగిన వాటిలో సహస్రాంశమును కూడ బయటపెట్టుటలేదు. ఆ కారణముగ పాకిస్థాన్ ముస్లిము నాయకుల దుష్ప్రచార ఫలిత ప్రమాణమును తగ్గించుటకు చాలవు. దేశవిభజనకు పూర్వము దాదాపు సంవత్సరమునుండీ ముస్లిములు ప్రత్యక్ష ఉద్యమమునకు దిగిరి. ఇపుడు ప్రత్యక్ష చర్యకు దిగెదమని బెదరించుచున్నారు. విభజన జరిగినప్పటికీకూడ అసలు సమస్య పరిష్కారము కాలేదు. ఢిల్లీ నుండి వచ్చిన వార్తలను బట్టి అక్కడ ఆయుధ కేంద్రములు ఏర్పాటు చేయబడినట్లు వెల్లడియగుచున్నది. ఢిల్లీలో జరిగిన ఉదంతములు ప్రపంచమునకు, భారతీయులకు తెలియుచున్నవిగాని పాకిస్థాన్‌లో ఏమి జరుగుచున్నదీ బొత్తిగ తెలియుటలేదు.

సర్ జఫరుల్లా బెదరింపులకు భారత ప్రభుత్వ జవాబుగాని, నాలుగు రోజుల క్రితము లియాకతాలీఖాన్ గారి నిందలకు పండిత నెహ్రూ ఇచ్చిన జవాబుగాని, ఇంత నీరసముగ నుండుటకు కాంగ్రెసు అవలంబించిన విధానమే మూలము.

వారు దేశవిభజన నంగీకరించిరిగాని, దానికి అనుగుణ్యమైన విధానమును అనుసరించలేకపోయిరి. విభజనను ఒప్పుకొని, మరల దేశైక్యతను దృష్టియందుంచుకొని, ఉదాత్తబుద్ధితో వ్యవహరించిరి. అందువల్లనే ఉభయ అధినివేశములలోని అల్పసంఖ్యాకులను వలసపోవలదని హెచ్చరించిరి. కాని నేడు ఆ విధానమువల్ల ప్రయోజనము సున్నయని దినమూ జరిగిన సంఘటనలు రుజువు చేయుచున్నవి. విభజనకు పూర్వమున్న దృక్పథము విభజనానంతరము దుస్సాధ్యమని అనుకొనవలసివచ్చుచున్నది. దేశ పునరైక్యత అనునది అందనిపండని గ్రహించవలసి వచ్చుచున్నది. పాకిస్థాన్ నిర్మాతల దృక్పథము సంపూర్ణముగ వెల్లడి అయినది. జనాభా మార్పిడి అక్కరలేదని, అల్పసంఖ్యాకులకు సమానహక్కులు రక్షణ ఉండునని ప్రకటించిరి. కాని దినదినమూ, నడచుచున్న శరణార్థుల సమూహము చూచిన, ఈ రూపమున జనాభా మార్పిడి సాధింపబడుచున్నది. అది ఆగునట్లు లేదు. పండిత నెహ్రూకూడ ఈ అంశమును అంగీకరించెను.

కాబట్టి భారత ప్రభుత్వము తన పూర్వవైఖరిని కట్టిపెట్టి విభజన శాశ్వతమూ, తప్పను అను నమ్మకముతో సమస్యా పరిష్కారమునకు దిగుట అవసరము జనాభా మార్పిడి ఈ సందర్భమున ప్రథమ స్థానమును ఆక్రమించవలసియున్నది. పాకిస్థాన్ వీడదలచిన వారిని చేరవేయు కార్యక్రమమును అతి తీవ్రముగను దీక్షతోను సాగించుట అత్యవసరము. గాంధీజీ, తదితర భారత నాయకులు, ఇంకనూ, హిందూ ముస్లిము ఐక్యతకొరకు ఆశించుచున్నారు. "హిందువులు ముస్లిములు సోదరులుగ నివసించవలెనను నా కలను భగవంతుడు నిక్కము చేయును" ఆశించుచున్నానని గాంధీజీ చెప్పెను. ప్రస్తుతమునకు ఇది కలవలెనే యుండునట్లున్నది భారత నాయకులు ఉదారవైఖరి అవలంబించుచుండ పాకిస్థాన్ ముస్లిము నాయకులు, దానికి పూర్తిగ విరుద్ధవైఖరి నవలంబించుచున్నారు. స్వాతంత్ర్య లబ్ధికి పూర్వమున్న వైఖరి దేశవిభజనను నివారింపలేకపోయినది. పైగా ఆ వైఖరి భారత ప్రభుత్వము ఒక నిష్పష్ట విధానము అవలంబించుటకు నిరోధకమగుచున్నది. ఒకవేళ ఉభయ ప్రభుత్వములు సమాధానమునకు వచ్చినను ఉభయ ప్రదేశ ప్రజలు తమకు కలిగిన బాధలను దీర్ఘకాలము వరకుమరచిపోవుదురనుట కష్టము.

## ఇతరబ్యాంకులకు రిజర్వుబ్యాంకుఅప్పు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: క్లిష్టసమయములలో, షెడ్యూల్డు బ్యాంకులయినను కాకపోయినను, ఆ బ్యాంకులను కాపాడుటకు రిజర్వుబ్యాంకు, తగినదని తనకు తోచిన సెక్యూరిటీల తాకట్టుపై వలసినంత అప్పుం యివ్వవచ్చును. అని ప్రకటిస్తూ ఇందు కొరకు రిజర్వుబ్యాంకు చట్టమును సవరణచేస్తూ ఒక ఆర్డినెన్సు ఈరోజు జారీచేయబడినది. రిజర్వుబ్యాంకు 17 వ సెక్షన్ ప్రకారం, కొన్ని నిర్ణీతమైన సెక్యూరిటీల తాకట్టుపయిన నే రిజర్వుబ్యాంకు షెడ్యూల్డుబ్యాంకులకు అప్పు యివ్వవచ్చును. కాబట్టి క్లిష్టసమయములలో రిజర్వుబ్యాంకు ఆబ్యాంకులను కాపాడుటకు వీలు చిక్కుటలేదు. అందువలన తగినవని తనకు తోచిన సెక్యూరిటీల తాకట్టుపై అప్పుయివ్వుటకు రిజర్వుబ్యాంకు సెంట్రల్ బోర్డు ఆఫ్ డైరెక్టర్లకు అధికారమిస్తూ బ్యాంకింగు బిల్లులో నిబంధనలు చేర్చబడినవి. ఆ బిల్లు త్వరలో శాసనముగ అవకాశం లేనందువలన, ఆపనికొరకే ఈ ఆర్డినెన్సు జారీచేయబడినది.

# నిజాం రాజ్యాంగసలహాదారుగా సుల్తాన్ అహమ్మద్ నియామకం

## త్వరలో ప్రధాని ఛతారీ నవాబుకూడా నిష్క్రమించే సూచన

## అక్టోబరు 15 నాటికి సంస్థానం యూనియన్‌లో చేరుతుందని అధినివేశప్రభుత్వ నమ్మకం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, సెప్టెంబరు 19: ఇదివరలో నరేంద్ర మండలికి రాజ్యాంగ సలహాదారుగా పనిచేసిన సర్ సుల్తాన్ అహమ్మద్‌ను నిజాం ప్రభుత్వం మాంక్టన్ స్థానే రాజ్యాంగ సలహాదారుగా నియమించుకున్నట్లు తెలుస్తున్నది. అక్టోబరు మొదటివారంలో ప్రధానామాత్య పదవినుంచి ఛత్తారీ నవాబుకూడా తప్పుకుంటున్నాడు. ఇతనిస్థానే ఎవరు కొత్త ప్రధాని అయేదీ త్వరలోనే అధికార ప్రకటన వెలువడుతుందని తెలుస్తున్నది.

నిజాం సంస్థాన వైఖరి అక్టోబరు 15 వ తేదీనాటికి తేలిపోవడం అవసరమని ఇండియా అధినివేశ ప్రభుత్వం ఒక గడువుపెట్టి, హెచ్చరికకూడా చేసింది. ఈ గడువు తేదీలోపుగానే, సంస్థానంలో బీభత్సకాండను రేకెత్తించిన ప్రధాని ఛత్తారీ నవాబు, రాజ్యాంగ సలహాదారు మాంక్టన్ ఉభయులూ తప్పుకుంటారన్నమాట.

ఛటారీ నవాబుగారు

ఇత్తెహాదుల్ ముస్లిం నాయకుడు రజ్వీ హెచ్చరిక్క బెదిరింపులకు భారత అధినివేశ ప్రభుత్వం ఏమాత్రం లొంగదు. నిజాం ప్రభుత్వాన్ని ఎన్నివిధాల వీలైతే అన్నివిధాలా లొంగదీసి దాని అంతు కనుక్కోడానికి అధినివేశ ప్రభుత్వానికి తగిన అధికారాలు శక్తిసంపదా లేకపోలేదని ఇక్కడ అంటున్నారు.

మాంక్టన్, ఛత్తారీ నవాబుల నిష్క్రమణతో నిజాం సంస్థానం భారత సమాఖ్యలో చేరడానికి అడ్డుపడుతున్న ప్రతికూల శక్తులు తొలగిపోతవన్న మాట.

విశాల దృక్పథాన్ని అవలంబించి, కనీసం స్వీయ క్షేమంకోసమైనా నిజాం సంస్థానం అక్టోబరు 15-వ తేదీనాటికి భారత సమాఖ్యలో చేరి తీరుతుందని అధినివేశ ప్రభుత్వం గట్టిగా నమ్ముతున్నది.

సర్ సుల్తాన్ అహమ్మద్

సంస్థాన ప్రజలను గూండా రాజ్యంనుంచి రక్షించాలని కోరారు. పోలీసులుగూండాలు జరుపుతున్న అమానుష కృత్యాల కు... తాలూకా అంతా దోపిడీ అయిపోయిందనీ 6 బళ్లనిండా విలువైన వస్తువులను పోలీసులు తీసుకపోయారనీ తెలియ చేశారు.

### రామానందతీర్థగారిఆరోగ్యం

హైదరాబాద్, సెప్టెంబరు 19: సంస్థాన కాంగ్రెస్ కార్యాలయ ప్రకటన వల్ల ఈ దిగువ సంగతులు తెలుస్తున్నాయి: సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానందతీర్థగారి ఆరోగ్యం ఇప్పుడు కొంచెం నెమ్మదిగానే వుంది. వారు జైలులోనే వున్నారు. హైదరాబాద్‌లోని చంచల్‌గుడా సెంట్రల్ జైలులోని 25 మంది డిటెన్యూలను గుల్బర్గా జైలుకు పంపారు. స్థానిక ఇనుము ఉక్కు కర్మాగారాలలోని కార్మికులు సుమారు 3 వందల మంది కాంగ్రెస్ సత్యాగ్రహానికి సానుభూతిగా సమ్మెకట్టారు. కరీంనగరంజిల్లా పొత్తూరులో ఇళ్లమీదవున్న భారత పతాకాలను పోలీసులు తొలగించి వేశారు. జంతియాల్ లో విద్యార్థులు సమ్మెచేసి, ప్రదర్శనలు జరిపారు. ఖిల్కిలో కారణం తెలపకుండా 35 మందిని అరెస్టుచేశారు. గుడ్యూరులో సత్యాగ్రహం చేసినందుకు 20 మందిని అరెస్టుచేశారు.

### ఉద్యోగాలకు రాజీనామాలు

ఇల్లెందు తాలూకా రాఘవపురం శేకుపల్లి గ్రామాలకు మాలీపటేలుగాను, పోలీసు పటేలుగాను పనిచేస్తున్న శ్రీ వడ్లమూడి బాపనయ్యచౌదరిగారు నిజాం ప్రభుత్వ దమన నీతికి నిరసన తెల్పుతూ తమఉద్యోగాలకు రాజీనామా లిచ్చారు. స్టేటుకాంగ్రెసు పిలుపురాగానే ఈ తాలూకాలోని, తిమ్మారావుపేట గ్రామాల మాలీపటేళ్లు మరియు పోలీసుపటేళ్లుకూడా తమ పదవులకు రాజీనామాలివ్వటానికి సిద్ధంగా వున్నారు.

నల్లగొండజిల్లా జనగామ తాలూకాలోని చీటూరు గ్రామపోలీసు పటేలుగా పనిచేస్తూవున్న శ్రీ సీతారామ రెడ్డిగారు, నిజాంప్రభుత్వ దమననీతిపట్ల అసమ్మతి తెలుపుతూ తమ ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు.

మధిర తాలూకా గానుగపాడు గ్రామ మాలీపటేలుగా పనిచేస్తూవున్న శ్రీ జమలాపురం లక్ష్మీకాంతరావుగారు నిజాం ప్రభుత్వదమన నీతిపట్ల నిరసన తెలుపుతూ, తమ ఉద్యోగానికి రాజీనామా నిచ్చారు. వీరు తమ రాజీనామా సంగతిని మధిర తహశీల్‌దార్ గారికి తెలిపినారు.

ఇండియన్ యూనియన్‌లో దీవుల్లాగ పడివున్న నైజాం గ్రామాలలో, గానుగపాడు ఒకటి యిటీవలనే యిక్కడి ప్రజలు, నిజాంతో తెగతెంపులు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. అక్కడి మాలీ పటేలుగా పనిచేస్తూవున్న శ్రీ జమలాపురం లక్ష్మీకాంతరావుగారు, ఆ గ్రామ ప్రజల ప్రయత్నాలకు సహకారం నెరపుతూ తమ ఉద్యోగానికి రాజీనామా యిస్తూ ఇలా ఒక ప్రకటన చేశారు.

ప్రస్తుత నిజాం పరిపాలన విధానము న్యాయశాస్త్రమునకు పూర్తిగా వ్యతిరేకముగా జరుగుచున్నదని వివిధ పత్రికల ద్వారా తెలియుచున్నది. మేము (వతన్‌దార్లము) గ్రామస్థుల రోగాలనుమందు... లక్ష్యంగా పెట్టుకొని రైతుల యోగభాగ్యములపై ఆధారపడి స్వల్ప వేతనములమీదనే పరిపాలనా చక్రమునకు సహకరించియుంటిమి. ప్రస్తుత పరిపాలనా విధానంవల్ల రైతులు విపరీత బాధలకు సరిజాయి మాన ప్రాణములు వదలుచున్న యీ సమయంలో రైతుల మీదనే ఆధారపడివున్న మేము వారలతో సహకరించక తప్పనిసరిగాని గనుక నేను రైతుల బాధలు నివారణఅయి రైతుల న్యాయమైన కోర్కెలు చెల్లించి రక్షణబాధ్యత ప్రభుత్వం వహించువరకు నా ఉద్యోగధర్మమును నిర్వహించుట సాధ్యముకాదని యీ తేదీనుంచి ఉద్యోగధర్మమును నిర్వహించజాలనని యిందు మూలముగా తెల్పుకొంటున్నాను.

హుజూర్నగర్ పేట తాలూకా నాముపారం లో 14 వ తేదీన స్థానిక జేళను ఖైదులను, వతన్‌దార్లను అగు శ్రీ కేసరి రామనర్సింహారెడ్డి, బి. నర్సింహారెడ్డిగార్లను, వర్తక ప్రముఖుడగు శ్రీ నారాయణ గుప్తాగారును ప్రభుత్వ నిషేధాజ్ఞల నల్లంఘిస్తూ సత్యాగ్రహం చేసినారు ఆరాత్రి పోలీసులు వారినుస్తరిని అరెస్టుచేసి సూర్యాపేట తీసుకపోయినారు.

ఇదేరోజు ఈ తాలూకాలోని ...మల్ల గ్రామానికి సూర్యాపేట పోలీసు ఇన్స్‌పెక్టరు, కొందరు పోలీసులతో వచ్చి గ్రామంలో ఎగుర వేయబడిన యూనియన్ పతాకాన్ని తీసివేసి దాన్ని అవమానపరిచారు. ప్రభుత్వ నిషేధాజ్ఞల నల్లంఘిస్తూ సత్యాగ్రహంచేసిన శ్రీ బుంగం వీరయ్యగార్ని త్రాళ్లతో చేతులుకట్టి అరెస్టుచేసుకొని తీసుకవెళ్లారు.

వరంగల్లు జిల్లాలోని, పాల్వంచ తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ కొట్టిపల్లి వెంకటరావుగారికిని, కార్యదర్శి శ్రీ కంభంపాటి సుబ్బారావుగారికిని, పాల్వంచ తాలూకా మున్సిఫ్ కోర్టువారు రెండేసిమాసాల కఠిన శిక్ష విధిస్తూ తీర్పు చెప్పినారు.

ఈ తాలూకాలోని రెడ్డిపాలెం గ్రామ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ వెన్నా చెన్నారెడ్డిగారికి, మూడుమాసాల కఠిన శిక్ష విధిస్తూ తీర్పు చెప్పబడింది.

ఈ ముగ్గురు కాంగ్రెస్ కార్యకర్తలు, యింతకుముందు ప్రభుత్వ నిషేధాజ్ఞలను ఉల్లంఘిస్తూ సత్యాగ్రహం జరిపియుండిరి.

రెడ్డిపాలెం గ్రామంలో యెగురవేయబడిన యూనియన్ పతాకాన్ని తీసివేయుటకై భూర్గంపాడు నుండి 18మంది పోలీసులు వచ్చారు. అయితే గ్రామప్రజలందరు యేకమై ఇండియన్ యూనియన్ ప్రాంతంలో నున్న భద్రాచలం పౌరులుకూడా వారికి అండవుండగా పతాకాన్ని తీయుటానికి వీల్లేదని పోలీసులను హెచ్చరించారు. పోలీసులు వెళ్లిపోయారు.

నల్లగొండ జిల్లా సూర్యాపేటలో, లోగడ సత్యాగ్రహం చేసి నిర్బంధింపబడిన 7 గురు కాంగ్రెస్ కార్యకర్తలను విచారించి, వారిలో ప్రతి ఒకరికి 6 నెలల కఠిన శిక్ష, 5 రు జుల్మానా, జుల్మానా చెల్లించని పక్షంలో మరి 45 రోజుల కఠినశిక్ష విధిస్తూ సూర్యాపేట కోర్టువారు తీర్పుచెప్పినారు. ఈ కాంగ్రెసు కార్యకర్తలలో శ్రీ పండిత విశ్వామిత్ర ఆర్య, పెద్దాపురం వెంకట నారాయణ మొదలగువారు ఉన్నారు.

వరంగల్లుతాలూకా గ్రామాల్లో ప్రముఖులు యెగురవేసిన యూనియన్ పతాకాలను కొన్నిటిని పోలీసులు వరుసగా తీస్తూ ఉన్నారు.

పంథిని గ్రామంలోని పతాకాన్ని తీసివేయడానికై, వరంగల్లు డి. యస్. పి. 3 లారీలలో 150 మంది మిలిటరీని వెంట బెట్టుకొని వచ్చినాడు. గ్రామంలో అరెస్టులేమీ జరుగలేదు. పతాకాన్ని తీసుకొని వెళ్లినారు.

అంతకు క్రితం రోజు తమ్మడపల్లి గ్రామంలో గ్రామమాలీపటేలు శ్రీ తోటపల్లయ్యగారు తమ యింటిపై యూనియన్ పతాకాన్ని ఎగురవేసిరి. ప్రముఖులు అభినందించినారు.

బండ అప్పరావుపురంలో ఎగురవేయబడిన యూనియన్ పతాకాన్ని వరదన్నపేట పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు 9 మంది రిజర్వు పోలీసులతోవచ్చి తీసివేసినాడు. ఇదే విధంగా సెప్టెంబరు 12 తే కూనూరు గ్రామంలో ఎగురవేయబడిన పతాకాన్ని పోలీసులు తీసివేసినారు.

## సింధులో రైలు ప్రయాణికులపై దాడి

### రైల్వే ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ దుర్మరణము

కరాచీ, సెప్టెంబరు 19: సింధుపరిస్థితి సంతృప్తికరముగా నున్నదని అధికారులు చెప్పుచుండ, నేడు ఉత్తర సింధులో నడుచుచున్న రైళ్లలో ప్రయాణీకులపై దాడి గావించిన వార్తలు వచ్చినవి.

షక్కూరునుండి కరాచీ వెళ్లుచుండిన రైల్వే ట్రాఫిక్ ఇన్‌స్పెక్టరు బహదూరుచాంద్‌ను చంపి, అతని ఆస్తిని దోచిరి. ఈతడు హిందూస్థానులో పని చేయనిచ్ఛగాదెను, ఒక నెలలో సెలవుతో అతడు వెళ్లునున్న ఆయన కరాచీ వెళ్లుచుండెను.

జకోబాబాదులో యానిఫారముల ధరించిన నలుగురు స్త్రీలు పెట్టెలోని కెక్కి, ప్రతిఘటన జూపిన ఒక తెలుగుని బైటికి త్రోసిరి. రైలువారి, గాయపడిన స్త్రీని జకోబాబాదు ఆసుపత్రికి చేర్చిరి. ఈ సందర్భమున కొంతమందిని అరెస్టు చేసిరి. షికార్‌పూరు దగ్గర యిద్దరు ప్రయాణీకులను రైలునుండి క్రిందికి పడద్రోసిరని తెలియుచున్నది.

## గాలిపల్లి దురంతాలు

### "భారత ప్రభుత్వం జోక్యం చేసుకోవాలి"

[స్వకీయవిలేఖరి]

బెజవాడ, సెప్టెంబరు 19: నిజాం సంస్థానంలోని కరీంనగరంజిల్లా సిరిసిల్ల తాలూకా గాలిపల్లి గ్రామస్థులపై సెప్టెంబర్ 14 న పోలీసులు జరిపిన కాల్పులు, దురంతాలు వివయమై ఇక్కడి సంస్థాన కాంగ్రెస్ కార్యాలయంవారూ, గాలిపల్లి వాస్తవ్యులు బి. నరసింహారెడ్డి, మచ్చు రెడ్డి గార్లూ జవహర్లాల్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్ పట్టాభి సీతారామయ్య గార్లకు టెలిగ్రాములు పంపారు. కాల్పులవల్ల 20 మంది చనిపోయారనీ, దురంతాలవల్ల 2 లక్షల విలువచేసే 16 ఇండ్లు తగలబడిపోయాయనీ 8 మంది స్త్రీలు చెరపబడ్డారనీ ప్రజలు గ్రామంవదలి పెట్టి వెళ్ళిపోయారనీ తెలిపారు. కేంద్ర ప్రభుత్వం కలుగజేసుకొని

# ఢిల్లీనుంచి పాకిస్థాన్‌కు ఆయుధ సామగ్రి పోవడం లేదట

## బ్రిటిష్ ఉద్యోగిపై ఆరోపణలు

## నిజం కావని మిలిటరీ అధికారి ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 19: ఢిల్లీనుండి పాకిస్థానుకు దొంగతనంగా ఆయుధాలు పంపడానికి ప్రయత్నించినందువల్ల ఒక బ్రిటిషు ఉద్యోగిని అరెస్టుచేశారని ఇక్కడ ప్రచారంలో ఉన్న వార్తలు నిరాధారమైనవని ప్రభుత్వ భవనంలో జరిగిన పత్రికా సమావేశంలో సైనికశాఖ ప్రతినిధి ఒకరు ప్రకటించారు. సైనిక కేంద్రస్థానం నుండి పాకిస్థానుకు పంపవలసిన ఒక పార్సెలులో ఆయుధాలూ, మందుగుండు సామగ్రి పట్టుబడ్డాయన్న వదంతిని పురస్కరించుకొని ప్రశ్న వచ్చినా, పై సమాధానం వచ్చింది. ఏ బ్రిటిషు ఉద్యోగినీ అరెస్టు చెయ్యలేదనీ వారిలో ఎవరిమీదా అనుమానమైనా లేదనీ ఆ ప్రతినిధి అన్నాడు.

సంయుక్త రాష్ట్రాలలో సోహిల్ ఖండ్, ఘజియాబాద్, డెహ్రాడూన్, హరిద్వారం, జ్వాలాపురం, బులందుషహర్, రూర్కీ, మధుర, ఆగ్రా మొదలైన ప్రదేశాలలో ఆందోళన వచ్చినందువల్ల, కొన్ని సంఘటనలు జరిగాయనీ, ఈ ఆందోళనకు వీటి ప్రక్కనున్న భరతపుర సంస్థానంలోని కల్లోలాలే కారణమనీ తెలియవచ్చింది. ఈ కల్లోలాల పరిస్థితి కంటకూ అయా ప్రదేశాలకు వచ్చిన కాందిశీకులు చెప్పే భయానకగాథలే కారణమనీ, ఇవి ఇతర ప్రదేశాలకు వ్యాపించకుండా సైనికాధికారులు కఠినచర్యలు తీసుకుంటున్నారనీ ఆ ప్రతినిధి అన్నాడు.

పతికలూ విభ్రాంతి ఉత్పత్తి చేసిన తర్వాత జరిగిన సోదాలలో ఒక ముస్లిం గృహంలో పట్టుబడ్డ ఆయుధసామగ్రి ఒక పటాలాన్ని సాయుధం చెయ్యడానికి సరిపోయేటంత ఉన్నదన్నమాట వాస్తవమేనా అనిగా దోకిరనన్ని చోట జాగ్రత్తపడుతున్నారనీ రెక్కలు కొద్ది రోజుల్లో తెలుపగలమనీ ఆయన అన్నాడు.

## అమెరికన్ పత్రిక హెచ్చరిక

[1 వ పేజి తరువాయి]

కీతంగా పెరిగి పోతున్నదనీ, 1957 వచ్చేసరికి అమెరికా కంటె సైనికంగా ఎక్కువ బలిష్ఠమై, దెబ్బతీయ గలిగిన శక్తిని పొందుతుందనీ సివిలియన్ అడ్వయిజరీ కమీషన్ అమెరికాకు హెచ్చరిక చేస్తున్నది. ఈ హెచ్చరికలోని ముఖ్యాంశాలు.

(1) 1948 లో రష్యా అమెరికాపై ఎకాఎకిన 1000 విమానాలను ప్రయోగించ గలిగిన స్థితిలో వుంటుంది. ఐతే ఈ విమానాలకు స్వస్థానాలకు తిరిగివచ్చేటంత సామర్థ్యం వుండదు. (2) 1949 లో 3000 మైళ్ళలోవున్న ప్రాంతాలపై స్వయంగా మన మారణాస్త్రాలను ప్రయోగించ గలుగుతుంది. ఈ ఆయుధాలలో ఒక్కొక్కటి టన్ను బరువువరకూ ప్రేలుడు పదార్థాలను మోసుకగలదు. (3) 1952 వచ్చేసరికి ప్రజలలో భయంకరమైన వ్యాధులు ప్రబలేటట్లు చేయగల మరొకరకం మారణాస్త్రాలను మారప్రాంతాలపై ప్రయోగించవచ్చు. 1952 అనంతరం రష్యా యాటంబాంబును విరివిగా ఉత్పత్తి చేస్తుంది. (4) 1957 ప్రమాదకరమైన, సంఘర్షణకు దారితీయగల సంవత్సరం. అప్పటికి దాని ఆయుధబలనిర్మాణం పూర్తిఅయి, దెబ్బ తీయ కలుగుతుంది.



బ్రిటన్లో ఆధికాహారోత్పత్తి నిమిత్తం, వెనక ఫిరంగిదళ తర్ఫీదు మైదానాలుగా ఉన్న ప్రదేశాలను సాగుకింకి తెచ్చారు. అట్టి పొలాలలో ఒకచోట యంత్రసహాయంతో కోత జరుగుతున్న దృశ్యం. ఈ యంత్రం పైరునుకోసి కూల్చివేస్తుంది. ఇద్దరు వ్యక్తులు దీనిని నడుపుతారు.

# స్టెర్లింగ్ మారకం
## బ్రిటన్ ఆర్థికస్థితి విచారణ

బ్రిటన్-అమెరికా ఆర్థిక ఒడంబడిక ననుసరించి 1947 జులై 15 తరువాత స్టెర్లింగు మారకమునకు ఎలాంటి అభ్యంతరములనూ పెట్టక బ్రిటన్ తాను చెల్లింపవలసిన స్టెర్లింగును ఏ దేశమే నానాణెములు కావలెనన్న ఆ నాణెములలో చెల్లింపవలసియున్నది. ఆ ప్రకారంగానే బ్రిటిష్ ఖజానా శాఖాధికారి డాక్టర్ డాల్టన్ స్టెర్లింగు స్వేచ్ఛా మారకమునకు వీలు కలిగించెను. కాని ఒకమాసం కాకపూర్వమే ఈ ఏర్పాటును ఉపసంహరించుకొనవలసి వచ్చెను. ఈ మారకం ఏర్పాటువల్ల బ్రిటన్ ఆర్థికస్థితి విషమించిందని ఆందోళన ప్రారంభమైంది. జులై 12 వ తేదీన ఈ మారకంవల్ల కలుగు ఫలితాలను వివరిస్తూ 'నేషన్' (అమెరికా) పత్రికలో కీత్ హాచ్చిన్సన్ వ్రాసిన ఈ వ్యాసం ఈ సమస్య నవగాహన చేసుకొనుటకు ఉపకరింప గలదు.

జులై 15 స్టర్లింగు గుణాగుణాలకు నిర్ణాయక దినం. ఇతర దేశ కరెన్సీలతో పోల్చిచూస్తే పౌను గూడా ఆ రోజుతో ఏ దేశ నాణెంలోకైనా మార్చుకోవడానికి వీలుండే స్వతంత్రకరెన్సీ అవుతుంది. స్టర్లింగు ప్రాంతంలో నిషేధాల నుపసంహరించడంలో ప్రథమదశ గూడా ఆ రోజుతో ప్రారంభించడం తటస్థిస్తుంది. కాబట్టి ఇప్పటినుండే ఎగుమతి దిగుమతుల వల్ల ఉత్పన్నమయ్యే స్టర్లింగూ, వెనక నిరుద్ధమైన నిల్వలనుండి వాడడానికి వదలి వేయబడిన మొత్తమూ కూడా ఏ విదేశ నాణెంలోకైనా మార్చుకోడానికి వీలుంటుంది. ప్రస్తుతంలో తాను ఎన్ని క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంటూ ఉన్నా గత సంవత్సరం అమెరికా 375 కోట్ల డాలర్లు బ్రిటనుకు ఋణమిచ్చేటప్పుడు విధించిన షరతులను బ్రిటను సక్రమంగా పాటిస్తాం దని దీన్నిబట్టి తెలుస్తుంది.

### స్టర్లింగ్ మారకం

స్టర్లింగు మారకం అంటే ఆచరణలో అర్థమేమిటో తెలుసుకోవాలి. ఉదాహరణకు కెయిరోలోని మహమ్మద్ అబ్బాస్ 10,000 పౌనుల విలువగల పత్తిని క్రిందటి నెలలో మాంచెస్టరు వారికి అమ్మాడని ఊహించుకుందాం. అయితే ఆ మొత్తంలో ఆయన స్టర్లింగు ప్రాంతంలో ఎక్కడైనా ఏ వస్తువైనా కొనుక్కోవచ్చుగాని అమెరికను ఎరువులను కొనుక్కునేందుకు గాను డాలర్లలోకి మార్చుకోవడానికి వీలులేదు. డాలర్లు కావాలంటే, ఆయన ముందుగా ఈజిప్షియన్ మారకపు కంట్రోలు సంఘం వారికి దరఖాస్తు పెట్టుకోవాలి. వారు స్టర్లింగు ప్రాంతపు మొత్తం డాలర్లలో నుంచి బ్రిటిషు యజమానులు ఈజిప్టుకు నిర్ణయించిన కోటాలో ఈ మొత్తం చేర్చి ఆ సొమ్ము ఇప్పించవలసినంత అవసరం ఆయనకు ఉన్నదా అని విచారించి నిర్ణయిస్తారు. కాని జులై 15 తరవాత అబ్బాస్ గనక ఈజిప్టుదేశపు వస్తువులను బ్రిటిషు కొనుగోలుదారులకు అమ్మినట్లయితే ఆ మొత్తాన్ని ఆయన డాలర్లు, పీసాలు, క్రోనర్లు, మొదలైన ఏ విదేశ నాణెంలోకైనా మార్చుకునేటవ ఇష్టంవచ్చినచోట కావలసిన వస్తువులు కొనుక్కోవచ్చును. అయితే ఈ అవకాశం పెట్టుబడి వ్యాపారానికి సంబంధించిన మొత్తాలకు మాత్రం ఉండదు. అంటే అబ్బాస్ ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీసులో పెట్టుబడిపెట్టిన మొత్తంపై వచ్చిన ఆదాయంతో డూపాంట్ షరుకులు (ఫ్రెంచిషరుకులు) కొనుక్కోవడానికి వీలుండదు.

### ప్రమాదం ఏమీ లేదు

జులై 15 తర్వాత ఏదో ఒక దిఢమైన విపత్తు వస్తుందని భావించడానికి ఎటువంటి హేతువూ కనిపించడంలేదు. నిజానికి లండనుకు కావలసిన డాలరు మొత్తం పరిగణింపదగినంతగా ఎక్కువ లేకపోవ్వచ్చు. విదేశవస్తువులకూ, దేశాల్లో ఉద్యోగులకు చెల్లించిన మొత్తం అంతా యథేచ్ఛగా మార్చుకొచ్చునని సిద్ధాంతంలో ఉన్నప్పటికీ ఆచరణలో మాత్రం బ్రిటను తోడివ్యాపారంలో చేసిన నికరాదాయం మాత్రమే మారకానికి వినియుక్తమవుతుంది. పైగా కరెన్సీ విధానంలో కఠినంగా ఉండే అమెరికా, కేనడా, అర్జెంటినా దేశాలకు సంబంధించినంత వరకూ కనబడిన కొన్నాళ్ల నుండే ప్రస్తుతం వ్యాపారంలో ఉన్న స్టర్లింగూ దాగానే మారకమవుతోంది. అదికాక మొత్తం నపుగా ఈ దేశాల నుండే బ్రిటను ఎక్కువ ఋణం పుచ్చుకున్నది. బ్రిటను మిగతా ప్రపంచంలోని దేశాలకు ఇవ్వవలసివచ్చేది, ఆయా దేశాలు బ్రిటనుకు ఇవ్వవలసివచ్చేదీ రెండూ ఒకదానికొకటి ఉజ్జాయింపుగా చెల్లు అయిపోతాయి. కాగా బ్రిటనుకు తాము అమ్మినదానికంటే బ్రిటను నుండి చాలా ఎక్కువగా కొనుక్కొన్న ఇండియా ఈజిప్టులకు మారకానికి వీలయ్యే స్టర్లింగు నిలవ అట్టే ఉండదు.

ఇక భవిష్యత్తులో ఇండియా ఈజిప్టులు ఈ దేశానికి పంపే ఎగుమతుల ఆదాయానికి మించి డాలర్లను వినియోగించుకో గలిగే సామర్థ్యం ఇప్పటి స్టర్లింగు నిలవలను విడుదల చెయ్యడం మీదే ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. ఇంతవరకూ ఈ నిల్వలు స్టర్లింగు ప్రాంతంలోనే చెలామణి అవుతూ, డాలరు పూలుకు సంబంధించినంతవరకు ఇతర దేశ నాణాలలోకి గూడా మార్చుకోవడానికి వీలుపడుతూ ఉన్నది. ఆంగ్లో అమెరికన్ ఆర్థిక ఒప్పందాన్నిబట్టి జులై 15 తర్వాత విడుదలైన స్టర్లింగు నిల్వలన్నీ ఏ విదేశ నాణెంలోకైనా మార్చుకోవడానికి వీలున్నది.

### బ్రిటన్ ఇవ్వదేలిన అప్పు

లండన్, బాంకులలో విదేశాలకున్న లెక్కలనుబట్టి మొత్తం బ్రిటను ఇవ్వదేలే ఋణం దాదాపు 3 బిలియన్ల పౌనులు గాని 12 బిలియన్ల డాలర్లుగాని ఉంటుంది. పౌండును విచ్ఛిన్నం చెయ్యకుండా అటువంటి మొత్తాన్ని ఇతర దేశాల నాణాలలోకి మార్చడానికి వీలులేదు. అందుచేత బ్రిటిషు ప్రభుత్వం స్టర్లింగు ఋణదాతలకు దీర్ఘకాలంలో మెల్లమెల్లగా విడుదలచేసి తీర్చుకోవాలని ప్రయత్నిస్తోంది. ఒక్క అర్జెంటినా విషయంలో తప్ప తక్కిన దేశాలతో సంప్రతింపులు ఏమంత సుకరంగా లేవు. అర్జెంటినా అయినా తమ దేశంలో ఉన్న బ్రిటిషువారి రైలు దార్లను కొనుక్కుని ఎంతో పెద్ద మొత్తం చెల్లుకొట్టి వేసింది.

### ఇండియా, ఈజిప్టుపై ఖరి

స్టర్లింగు ఋణదాతల్లో అగ్రేసరులైన ఇండియా, ఈజిప్టులు బ్రిటిషు సంప్రతింపుదార్లు సూచించిన షరతులను ఆమోదించడానికి సిద్ధంగా లేవు. అక్షరాజ్యాలనుండి వాటిని సంరక్షించడానికి బ్రిటను చెల్లించిన మూల్యంగా భావించి ఈ ఋణాన్ని చాలాభాగం తగ్గించడానికి వారు ఏమైనా ఒప్పుకోవడం లేదు. వెంటనే విడుదల చెయ్యవలసిన మొత్తం విషయంలోనూ, నిలవనంతటినీ ఎప్పుడెప్పుడు ఎంతెంత చెల్లించాలన్న విషయం గోనాగూడా ఆ దేశాలతో అంగీకారం కుదరలేదు. నిర్ణాయక దినం జులై 15 సమీపిస్తూ ఉండటంతో బ్రిటిషు ప్రభుత్వం ఈ నిల్వలను పూర్తిగా నిరోధించాలని తమంతటతామే నిశ్చయించవలసి వస్తుందేమో అనిపించింది. కాని అప్పుడే ఈజిప్టుతో ఒక తాత్కాలికపు టంగీకారం కుదిరినట్టు ప్రకటితమైంది. తన్మూలంగా ఇండియా, ఇరాకు మొదలైన స్టర్లింగు ఋణదాతలతోగూడా ఆ పంథాలో తమపు టొడంబడిక చేసుకునే అవకాశం లభించవచ్చునని తోచింది. ఈ పథకం ప్రకారం ఈజిప్టు తాను స్టర్లింగు ప్రాంతంలోనుండి విరమించుకుంటుంది. ఇప్పుడు దానికున్న స్టర్లింగు నిల్వలన్నీ లండనులో ప్రత్యేక లెక్కలలో నిలబడిపోతాయి. ఏమైనా వచ్చే ఆరునెలల్లోనూ ఈజిప్టు వంతు స్టర్లింగు విడుదల దాదాపు 4 కోట్ల డాలర్ల విలువ ఉంటుంది. ఇటీవలి వాటాను బట్టి అయితే ఇంకా కొంచెం ఎక్కువే విడుదలకావచ్చు. కాబట్టి ఈజిప్టులో అమెరికా వ్యాపారానికి ఇది ప్రోద్బలకం అవుతుంది.

### బ్రిటన్‌స్థితి క్షీణించింది

ఇటీవరలో కొన్నివర్గాలవారు ఊహించినట్టుగా అమెరికా ఋణంవిషయంలో మారకపు షరతును పాటించడానికి కొంచెం వ్యవధి కొంచెం పొడిగింపవలసి ఉంది. బ్రిటను కోరనంతమాత్రాన దాని దీర్ఘకాలిక ఋణవిమోచన సమస్య ఏమంత ఫలికకాలేదు. పైగా ఈ సంవత్సరం మొదటి ఆరునెలల్లో బ్రిటను పరిస్థితి చాలా క్షీణించింది. 1950 వరకూ ఉండకుండానే, అమెరికాలు ఇస్తున్న అప్పు యావత్తూ వచ్చే సంవత్సరాంతంలో ఖర్చయిపోతున్నదే అని ఎంతో ఆందోళనపడవలసివచ్చింది. 1947 మొదటి అయిదు నెలల్లోనూ నెలకు సగటున 2 కోట్ల డాలర్ల విలువగల వస్తువులను బ్రిటను దిగుమతి చేసుకొన్నది. ఈ మొత్తం అనుకున్న దానికంటే చాలా ఎక్కువ. ఇక ఎగుమతులవిషయంలో మొత్తం సంవత్సరంలో చెయ్యాలనుకున్న దానిలో అయిదు నెలలు గడిచినా సగమైనా చెయ్యలేకపోయింది. దిగుమతుల మొత్తం పెరిగిపోవడంలో అమెరికన్ వస్తువుల ధర పెరగడంకూడా చాలా ముఖ్యమైన విషయం. బ్రిటనులో శీతాకాలంలో వచ్చిన ఇబ్బంది ఎగుమతులు చాలా దెబ్బతిన్నాయి.

1947 లో మిగిలిన కొద్దికాలంలోనూ ఎగుమతులలో చాలా అభివృద్ధి చూపించవలసిఉన్నది. కాని 1938 లో చేసిన దానికి నూటికి 140 వంతులు అధికంగా చెయ్యాలన్న ఆదర్శం మాత్రం సఫలమయ్యే ఆశ బొత్తిగా కనిపించడంలేదు. మొదటి అయిదు నెలల్లో సగటున నూరు వంతులు మాత్రమే చెయ్యగలిగిందారు! తత్ఫలితంగానే బ్రిటిషు ప్రభుత్వం గాసొలైన్, పొగాకు, న్యూస్‌ప్రింట్, మొదలైన కొన్నివస్తువుల దిగుమతిని చాలా తగ్గించి వెయ్యాలని కఠోరంగా నిర్ణయించింది. ఎన్నాళ్లనుంచో చాలా బాధలు పడుతున్న వినియోగదార్లకు ఇది చాలా పెద్దదెబ్బ! ఉత్పాదకశక్తులను నిరుత్సాహపరచి తద్వారా ఎగుమతి ప్రయత్నానికే దెబ్బతగలకుండా ఈ కఠోరదీక్షను బ్రిటను ఎన్నాళ్లు ఎంతనిగ్రహంతో పాటించగలదో చెప్పడం చాలాకష్టం.

## భారతమహిళా ఉద్యమం: రెండు దశాబ్దాల చరిత్ర పరిశీలన

రచన
శ్రీమతి కొండా పార్వతీదేవి

రాజకుమారీ అమృతకౌర్

భారత నారీలోకము, అజ్ఞానాంధకారమున మునిగి, సాంఘిక రాజకీయవిషయముల యందు, ఇతరదేశములకు వెనుకబడియున్నా మను పరిజ్ఞానముకూడ లేక, తమ జీవితాదర్శములను కూడ తెలుసుకొనజాలని స్థితిలో నుండగ, శ్రీమతి కజిన్సుగారు, ఐర్లండు దేశ నారీమణి, మహోదారమగు భావముతో, సర్వ మానవసౌభ్రాతృత్వము, విశ్వప్రేమయు, ఆదర్శముగా లీసుకొని, మనదేశమునందలి స్త్రీల సర్వతోముఖాభివృద్ధికై, కృషిచేయుటకు 1926 సంవత్సరమున ప్రారంభించిరి. ఆమె పత్రికా మూలమునను, స్వయముగను, విద్యావతులగు స్త్రీలతోను, ఉపాయలును, మహిళాభివృద్ధి యందు అభిమానులునునగు పురుషులతోను, సంప్రదించియు, ఉపన్యాసములిచ్చియు, స్త్రీల సమస్యల నెదుర్కొని పరిష్కరించుటకు, ఒక సంస్థ అవసరమని ప్రబోధించిరి. అందులకు ఫలితముగ, 1927 సంవత్సరములో, బరోడా రాణీఅయిన శ్రీమతి చిమ్నాబాయి గారి అధ్యక్షతక్రింద ప్రథమ అఖిలభారత మహిళాసభ జరుపబడెను. ఆ మహాసభకు శ్రీమతి కజిన్సు గారే గౌరవకార్యదర్శినిగానుండి సమర్థించిరి.

ఆ మొదటిసభలో స్త్రీల విద్యావిషయమైన తీర్మానములకే ప్రాముఖ్యత నిచ్చుచు, సాంఘిక విషయములలో అతి బాల్య వివాహములను గర్హించుచూ తీర్మానించిరి. కాలక్రమేణ సాంఘిక రాజకీయములగు తీర్మానములు కూడ ప్రవేశపెట్టిరి.

ఈసంస్థ అఖిలభారత మహాసంఘ మను పేరుతో ఏర్పడి, ఏ రాజకీయపక్షములందు పాల్గొనక, ఏ రాజకీయసంస్థకు చెందక, స్వతంత్రసంస్థయై, భారతదేశ ప్రజలయొక్కయు అందు ముఖ్యముగ స్త్రీలయొక్కయు, పిల్లలయొక్కయు క్షేమమునకు భంగము కలుగజేయువిషయములను గురించి చర్చించుచు, తీర్మానించుచు, ఆందోళన గావించుచూవచ్చిరి.

శ్రీమతి సరోజినీ నాయుడు

## 'రాజకీయాభిప్రాయాలు ఏమైనా మహిళలందరూ ఒకేసంఘంలో చేరి పనిచేయాలి''

శ్రీమతి కమలాదేవి

భోపాల్‌బేగమ్, సరోజినీదేవి, ముత్తులక్ష్మిరెడ్డి, పి. సి. రే సతి, రుస్తుమ్‌జీ ఫెరదూన్‌జీ, మహారాణి సేతు పార్వతీబాయి, శ్రీమతి తణిన్సు, రాజకుమారి అమృత్‌కౌర్, బేగమ్ హామీర్‌ఆలీ, రామేశ్వరీనెహ్రూ, విజయలక్ష్మి పండిట్, కమలాదేవి, హంసామెహతా, ధనవతీరామారావుగార్ల అధ్యక్షతక్రింద మహాసభలు జరుపబడి, వారి నాయకత్వముక్రింద ఈ మహోద్యమము నడుపబడినది.

### స్త్రీల హక్కుల సంరక్షణ

1932 సంవత్సరమున పి. సి. రే సతిగారి అధ్యక్షతక్రింద సమావేశమై రౌండుటేబిల్ కాన్ఫరెన్సుకు వినతిపత్రము (మెమొరాండమ్) పంపుటకు నిశ్చయించిరి. అందు, జాతి, మత భేదములులేకుండా పౌరుల కందరికీ సమాన హక్కు లుండవలెననియు, తెలివితేటలను బట్టి, విద్యాయోగ్యతనుబట్టి ఉద్యోగము లివ్వవలెనేగాని, స్త్రీలని అపేక్షణ యుండకూడదనియు, వయస్సునుబట్టి ఓటుఅధికార ముండవలెననియు, సామాన్య నియోజకవర్గము (జనరల్) అందు పురుషులతోపాటు స్త్రీలకు కూడా పోటీచేయు నవకాశ ముండవలెననియు, ప్రత్యేకముగ స్త్రీలకు స్థానము చేర్పరచుట (నామినేషన్) చేర్చుకొనుట (కోఆప్షన్) లు ఉండగూడదనియు వివరించిరి. రౌండుటేబిల్ సమావేశములో స్త్రీలకుకూడ స్థాన ముండవలెనని డిప్యుటేషన్ పంపిరి.

స్త్రీలకు ప్రత్యేక విద్యావిధాన ముండవలెనని, ఆదర్శగృహిణులను తయారుచేయుటకు 1932 సం.న లేడీ ఇర్విన్‌కళాశాలను ఢిల్లీలో స్థాపించి కడుసమర్థతతో నడుపుచున్నారు. స్త్రీలు బొగ్గుగనులలో పనిచేయరాదను నిషేధపు టుత్తరువును ప్రవేశపెట్టమనియు, అట్టి ఉత్తరువును తొలగించుట అన్యాయమనియు, మిల్లులలో పనిచేయు స్త్రీపనివారల కనేక సౌకర్యములు కలుగజేయమనియు, ఆందోళన సల్పిరి. భారతదేశమున కంతటికిని సామాన్య భాషయొకటి యుండుట అవసరమనియు, నిరక్షరాస్యత తొలగించుట ఆత్యావశ్యక మనియు తీర్మానించి, అందులకు కావలసిన విషయములను తెలుసుకొనుటకు, ప్రణాళికల నేర్పరచుటకును, ఉపసంఘముల నేర్పరచి ప్రచారము చేసిరి. మన దేశస్త్రీల సమస్యలపట్ల సానుభూతి, సహకారములు పొందుటకును, ప్రచారము చేయుటకును, ఇంగ్లండునందుకూడా లీజెన్ సంఘము నేర్పరచిరి, దేవాలయములలో హరిజనులకు ప్రవేశ ముండవలెననియు, అస్పృశ్యతానివారణ విషయములోను, ఆందోళన గావించిరి. ప్రపంచమందలి స్త్రీలసమస్యలు తెలుసుకొనుటకును, ఇతర దేశములవారితో మైత్రి సంపాదించుకొనుటకును, మనదేశ సమస్యలపట్ల సానుభూతి, సహకారములను పొందుటకును, మహిళాసంఘపక్షమున, విదేశములలో జరుగు అంతర్జాతీయ మహిళామహాసభలకు ప్రతినిధులను పంపుచున్నారు. శాసనసభలో దేశముఖ్, హరవిలాసశారదా, భగవాన్‌దాస్, బి. దాసుగార్లు ప్రవేశపెటిన స్త్రీల వివాహ, ఆస్తిహక్కుల సంబంధమైన బిల్లులను ప్రవేశపెట్టుటయందును, అమలుజరుపుటయందును, వాటికి సంబంధించిన సవరణలను ప్రతిపాదించియు, తీరనికృషి సల్పిరి, రావు కమిటీవా రిచ్చిన హిందూలా సవరణ ప్రణాళికయందు, తీవ్రమగు చర్చచేసి ఉపసంఘముల నేర్పరచి, అనేక సవరణల ప్రతిపాదించియు, యావద్భారతనారీలోకమునకు సౌకర్యము కలిగించవలెనని పాటుబడుచున్నారు. దక్షిణాఫ్రికాయందలి స్త్రీలసమస్యల పరిష్కరించుటకు అచ్చట నొక సంఘము నేర్పరచిరి, దేశములో నచ్చటచ్చట, అప్పటప్పటికి వచ్చు వరదలవలన, కరువులవలన నష్టము కలిగినప్పుడు ప్రజాపీడానివారణార్థము, చందాలు వసూలు చేసి పంపియు, సేవికాసంఘముల నేర్పరచి, ఆహారపదార్థములు పంచిపెట్టియు సేవజేయుచున్నారు. హిందువులు, ముస్లిములు కలిసిన స్త్రీలసంఘముల నేర్పరచి హిందూమహమ్మదీయసఖ్యతకును, శాంతిస్థాపనకును కృషి చేయుచున్నారు. ఒక ట్రస్టు, నర్సు కావలసిన ఔషధములుగల అశోకా అక్సరేవాన్ అనుబస్సు గ్రామగ్రామములకు త్రిప్పి ప్రసూతి సౌకర్యముల నొనగూర్చుచున్నారు.

### రెండు దశాబ్దాల కృషి

ఈవిధముగ విద్యాసాంఘిక రాజకీయములందు 20 సంవత్సరములనుండి కృషి చేయుచున్నారు. 19మహాసభలు జరిపినారు. ఈభారత మహిళాసంఘము ప్రస్తుతము అన్నిరాష్ట్రములలోను ముప్పదివేలు ప్రాథమిక సభ్యురాండ్రు కలిగి, నలుబదినాలుగుశాఖలు, 215ఉపశాఖలు కలిగి భారతదేశస్త్రీలసమస్యలన్నిటిని పరిష్కరించుటలో సాధనభూతమైన ఏకైకసంస్థగా నొప్పుచున్నది. మన దేశమున కాంగ్రెసు ఎట్టి బలవత్తరమైన సంస్థయో, అట్లనే స్త్రీలవిషయమై, వారి సర్వతోముఖాభివృద్ధికి తీరనికృషి చేయుటకు సమర్థమైన దీసంస్థయేను. భారతదేశ దాస్యవిముక్తికై తీర్మానించుచూ, జాతైక్యత, సామాన్య భాషాప్రచారము, అస్పృశ్యతానివారణ, గ్రామపరిశ్రమోద్ధరణము, నిరక్షరాస్యతను తొలగించుట మొదలగు కాంగ్రెసు నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటయందు తోడ్పడిరి.

శ్రీమతి విజయలక్ష్మి పండిట్

మనమాతృభూమి పరపాలననుండి విముక్తి బడసినది, భారత భావిభాగ్యోదయము, దేశము యొక్క శక్తిసామర్థ్యముమీద ఆధారపడియున్నది. స్త్రీలను, పురుషులను అనేకసమస్యలెదుర్కొని, ఈయుగపదుగ రాజ్యాంగరథమును నడిపించవలసియున్నది. శ్రీమతి విజయలక్ష్మిపండిట్‌గారిని రష్యా రాయబారిగ పంపుటయు, సరోజనీదేవిగారిని తాత్కాలిక గవర్నరుగ గౌరవించుటయు రాజకుమారి అమృతకౌర్‌గారిని మంత్రివర్గమందు సభ్యురాలిగ స్థానమిచ్చుటయు, భారతనారీమణులకు ఆనందకరమైన విషయమేను. అయినను ఇంతమాత్రముతోడ తృప్తిపొందజాలదు, స్వతంత్ర భారతమందును, స్త్రీలకు సంబంధించిన సమస్యలను చర్చించి, వాటి పరిష్కారము నిమిత్తము పాటుబడుటకును, ఐక్యకంఠముతోడ వక్కాణించుటకును, స్త్రీసంఘావశ్యకత యెంతయేని కలదు. అనేక వత్సరములనుండి సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించుచున్న ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు, స్విజర్లెండు, స్వీడన్, డెన్మార్కు మొదలగు పాశ్చాత్యదేశములలోనే స్త్రీసంఘము లవసరమైనప్పుడు, మన దేశవిషయము వేరుగ చెప్ప నవసరములేదు.

### ఇతర సంఘములు శ్రేయోదాయకం గాదు

ఇప్పటికి; ఇరువది సంవత్సరములనుండి సమర్థులైన మహిళారత్నములచే నడుపబడుచున్న, అఖిలభారత మహిళాసంఘ ముండగా ఇతరసంఘములు బయలుదేరుట నారీలోకమును గగ్గోలుపెట్టుటయేగాని, శ్రేయోదాయకము గానేరదు. మన ఆంధ్రరాష్ట్రమునందు 20 సంవత్సరములక్రితమే, మహిళాసంఘము అ. భా. మ. స. శాఖగ ఏర్పడి, 16 రాష్ట్రసభలు; కాకినాడలో అ. భా. మ. స. జరిపియున్నారు. ప్రస్తుతము 5,000 ఐదువేల ప్రాథమిక సభ్యురాండ్రు కలిగి, జిల్లాలలోను, తాలూకాలలోను, గ్రామములలోను సంఘములు కలిగి, వయోజన విద్యాతరగతులు, హిందీక్లాసులు, ప్రసూతిచికిత్సాలయములు నడిపించుచూ, నేతలు, రాట్నపరిశ్రమ మొదలైన వాటిద్వారా జీవనోపాధిని పేదస్త్రీలకు కల్పించుచూ సేవచేయుచున్నది.

స్త్రీలపాలిటి పెన్నిధానమువలె నిరంతరము పాటుబడుచున్న ఈ విశాలమగు సంస్థకే, విద్యావతులగు స్త్రీలందరు ప్రోత్సాహ మిచ్చి, స్త్రీల సర్వతోముఖాభివృద్ధికై తోడ్పడెదరుగాక!

## మైసూరుప్రజలకు విజయం తప్పదు!

### బొంబై కాంగ్రెస్ నాయకుల సందేశాలు

### బెంగుళూరులో సత్యాగ్రహ విజృంభణ

బెంగుళూరు, సెప్టెంబరు 19: వారం రోజులు క్రితంగా తిన్న తర్వాత బెంగుళూరులో సత్యాగ్రహోద్యమం తిరిగి పెల్లి విజృంభించింది. జిల్లా ఆఫీసులమూ స్కూళ్ళలమూ జన సమూహాలు పికెటింగు చేశాయి.

ఎక్కువ జీతాలు కావాలని పోలీసు సమ్మె చేస్తున్నందువల్ల సత్యాగ్రహులు మరింత విశృంఖలంగా ప్రవర్తించారు. బసవనగుడి ప్రాంతంలో ప్రదర్శనల చేష్టలు జోరుగా సాగాయి. దార్లకు అటంకాలు కల్పించడం, ఊరేగింపులు సాగించడం అత్యద్భుతంగా జరిగాయి.

ప్రభుత్వ కార్యాలయాలన్నిటివద్దా సత్యాగ్రహం చెయ్యడం మామూలుగా జరుగుతున్నప్పటికీ ఇక్కడ మాత్రం ఇవ్వాళే ప్రారంభమయింది. స్కూలు స్థానాలవద్ద పికెటింగులలో బాలికలు పాల్గొన్నారు. బసవనగుడి పోలీసు స్టేషనువద్ద యూనియన్ పతాక నెగురవెయ్యటానికి ప్రయత్నించారు గాని లాభం లేకపోయింది. జిల్లా కేంద్ర కార్యాలయ భవనంపై యూనియన్ జాతీయపతాకాన్ని ఎగరవేశారు. ఆపకాశం సాయంకాలం వరకూ అల్లాగే ఉంది. పతాకారోహణ తర్వాత అక్కడే ఒకసభ జరిపారు. కాని రిజర్వుపోలీసులు సభ్యులను చెదరగొట్టారు. బసవనగుడి సమీపంలో విద్యార్థి ప్రదర్శకులను పోలీసులు కేపబెత్తాలతో కొట్టి కొందరిని అరెస్టుచేసి చెదరగొట్టారు. విద్యార్థులు కొన్నిచోట్ల టెలిగ్రాఫు, ఎలెక్ట్రిక్ తీగలను తెంపివేశారు. జలోత్పాదక యంత్రాన్ని పాడుచేసినందువల్ల ఈ ప్రాంతంలో పంపులు పనిచెయ్యడంలేదు. ఈ అల్లరులవల్ల రాత్రంతా కర్ఫ్యూ ఉత్తరువు జారీ చేశారు. సంస్థానంలో ఇతరచోట్లనుంచి అధికారులకు వచ్చే వార్తలలో సత్యాగ్రహానికి సంబంధించినవి ఉన్నట్లు తెలియడంలేదు.

మైసూరులో ఇద్దరు పురపాలకసంఘ సభ్యులనూ, మద్రాసు రాష్ట్రపు కోయంబత్తూరుజిల్లానుండి అక్కడికి వెళ్లిన 8 గురు సత్యాగ్రహులనూ అరెస్టు చేశారు.

### ప్రజావిజయం తప్పదు

మైసూరు సత్యాగ్రహోద్యమం ప్రజల జన్మహక్కైన బాధ్యతాయుత ప్రభుత్వం సాధించాలన్న ఆదర్శంతో సంస్థాన కాంగ్రెసు నాయకత్వాన ప్రారంభమైంది. కాబట్టి దానికి దేశంలో సర్వస్వేచ్ఛాకాముకులైన ప్రతివారూ సహాయ సానుభూతులు చూపగలరని బొంబై రాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షుడు ఎస్. కె. పటేల్ ఉద్ఘాటించారు.

బొంబై ప్రభుత్వ పార్లమెంటరీ కార్యదర్శి కె. ఎస్. పటేల్ గారు మైసూరు సత్యాగ్రహులలో ప్రముఖులైన నిజలింగప్ప గారితో ఇల్లా అన్నారు:

"మైసూరు ప్రజలు తప్పక విజయం పొందుతారు. మైసూరు మహారాజా అందరికంటే ముందుగా తమ సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పుతారని నేను హృదయపూర్వకంగా ఆశించాను. వారూ, వారి సలహాదారులూ విజ్ఞతతో ప్రవర్తించక ఈ దారుణ దమననీతిని అవలంబించడం మిక్కిలి శోచనీయం. ఐక్య కర్ణాటక రాష్ట్రానికంతటికీ మహారాజాను రాజ్యాంగ నాయకునిగా చేసి కన్నడ సంప్రదాయానికి చిహ్నమైన ఆయన సింహాసనం ప్రక్కనఉండి పురాభివృద్ధి పొందుదామని కన్నడులందరూ వాంఛిస్తూ ఉంటే ఆయన ఆ గౌరవాన్ని స్వీకరించక కాలానికి ఎదురీదుకుంటుండడం మిక్కిలి విచారకరం."

### సైనిక ప్రతినిధి సమీక్ష

1వ పేజీ తరువాయి

సెప్టెంబరు 16 తర్వాత పశ్చిమ పంజాబునుండి వార్తలే రావడంలేదట.

పంజాబుతో సరిహద్దునువాటి చాలకొలది కాందిశీకులు అటూ ఇటూ ప్రయాణం చేస్తూ ఉండగా చాలాచోట్ల అశాంతి సంఘర్షణలూ జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. భారత సైన్యాలూ, సివిలు అధికారులూ శాంతిభద్రతలు కాపాడడానికి అత్యంత జాగరూకులై దృఢచర్యలు తీసుకుంటున్నారు.

గ్రామాల్లో విశ్వాసం పెంపొందించేందుకు భారతసైన్యాలు పతాకయాత్రలు జరుపుకున్నాయి. లూధియానా జిల్లాలో స్థానిక పటాలనేనాని 2500 మంది జవానికి ఉపన్యసించి దుర్మార్గులను నిర్మూలించడంలో సహాయపడండని విజ్ఞప్తిచేశాడు. సైనికులతో సహకరించి సివిలుఉద్యోగులు కూడా ప్రతి గ్రామంలోనూ పర్యటిస్తున్నారు.

వైమానికదళాలు ప్రతిరోజూ పోయి తూర్పుపంజాబు కేంద్రాలకు మందులుచేరవేస్తున్నాయి. కొత్తగా మరికొన్నిచోట్ల కూడా కలరా వ్యాపించినట్లు తెలుస్తున్నది.

పశ్చిమపంజాబు శాందిశీకులను తీసుకురావడానికై సైనిక కేంద్రస్థానం అమృతసర్‌కు రెండు సైనికదళాలను పంపింది. తూర్పుపంజాబు పరిపాలనలో సహాయపడేందుకు సైనికోద్యోగులు పంపబడుతున్నారు.

### బ్రిటన్ బంగారపు నిల్వలు

లండన్, సెప్టెంబరు 19: డాలరుకరువును గడచుటకు బ్రిటను తన బంగారపు నిలువల నుండి ఇంకా ఎక్కువ మొత్తం అమ్మకలసివచ్చునని డా॥ డాల్టన్ పత్రికా విలేఖరుల సభలో చెప్పెను. ఈ పరిస్థితి ప్రమాదసూచకముగా నెంచి, అధికోత్పత్తి అధిక ఎగుమతులకు తీవ్రకృషి చేయవలసిందని బ్రిటిషు ప్రజలకు ఆయన హెచ్చరిక చేశాడు. అంతర్జాతీయ బ్యాంకునుండి ఇంకా అప్పు తీసుకొనే అవకాశం, లేకపోలేదు. గాని, యిప్పట్లో అప్పు తీసుకొనవలెనను ఆలోచనలేదని ఈయన చెప్పాడు.

బ్రిటనులో తాత్కాలికంగా విషమపరిస్థితి ఏర్పడినదని అంతర్జాతీయ బ్యాంకు డైరెక్టర్లు భావించటంవల్లనే అప్పుయివ్వారని ఈయన చెప్పాడు. రానున్న శీతాకాలంలో ఇంకొక బడ్జెటు ప్రవేశపెట్టబడునా అని ప్రశ్నింపగా ఆయనసమాధానం చెప్పలేదు.

బ్రిటను ఈ మధ్యనే 2 కోట్ల పౌనుల బంగారం అమెరికాకు అమ్మినది. అంతర్జాతీయ బ్యాంకునుండి 6 కోట్ల డాలర్లు అప్పుపుచ్చుకున్నది. బ్రిటను బంగారపు నిలువల మొత్తం 60 కోట్ల పౌనులు.

షికాగో, సెప్టెంబరు 20: 1947-48 లో అమెరికా విదేశాలకు 60 కోట్ల బుషెల్సు ధాన్యాన్ని ఎగుమతి చేయుగల స్థితి వుండవచ్చునని ఇదే కనబడుతున్నదని అమెరికా వ్యవసాయ మంత్రి క్లింటన్ ఆండర్సన్, తెలియజేస్తున్నారు.

## ఒరిస్సా ఆంధ్రుల ఆందోళన

### ప్రధాని మెహతాబ్ కఠిన హెచ్చరిక

కటకం, సెప్టెంబరు 19: 'ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమును నిర్మింపవలెనని రాజ్యాంగపరిషత్తువారు యింకను నిర్ణయింపలేదు. వారిట్టి నిర్ణయము చేసిన యెడల, చేసినప్పుడు పరిహద్దునిర్ణయసంఘ మేర్పరుపబడును. ఆ సంఘము వివిధ వర్గములవారు చెప్పుదానిని విని నిర్ణయము చేయును. సరిహద్దుసంఘ నిర్ణయము అనిశ్చితిమై యుండ, సదరు సంఘమువారిని తమకు అనుకూలురనుగా చేసికొనుటకుగాను ప్రజలను ఉద్రిక్తులను గావించుటకును, వారిని అటువైపుకో యిటువైపుకో త్రిప్పుటకును సభలు యెందుకు అవసరమో ఎట్లవసరమో నేను ఊహింపజాలకున్నాను. ఏది యెట్లున్నను ఈరాష్ట్రములో శాంతికి భంగము కలుగజేయు పనులకు ప్రభుత్వమువారెన్నటికిని అంగీకరింపరు. ఈతగాదా సంగతి ఆదిమవాసులను వేరుగ నుంచవలెను వారిని రెచ్చగొట్టుట నిప్పుతో ఆటలాడుట యగును' అని ఒరిస్సా ప్రధాని శ్రీహరి కృష్ణమెహతాబ్‌గారు మద్రాసు ఒరిస్సా సరిహద్దు విషయమై ఒరిస్సా రాష్ట్రమునందలి రాయగడ మున్నగు ప్రదేశములలో తెలుగు ఉపన్యాసకులు గావించిన ఉద్రేకపూరితములగు ఉపన్యాసములను పురస్కరించుకొని హెచ్చరిక గావించుచున్నారు.

"కొందరు తెలుగు ఉపన్యాసకులు (వీరిలో కొందరు మదరాసు రాజధానివారు) మద్రాసురాష్ట్ర సరిహద్దునున్న రాయగడ మున్నగు ఒరిస్సారాష్ట్రాంతర్గత ప్రదేశములలో ఉద్రేకం కలిగించు ఉపన్యాసములను గావించుచున్నారని, ఇప్పుడు ఒరిస్సా రాష్ట్రమునందున్న కొన్ని ప్రాంతములు తిరిగి మద్రాసులో చేరవలెనని కోరుచున్నారని నాకు నివేదికలు వచ్చినవి. కొందరు, ఆదిమవాసులలో, వారివల్ల ఉపద్రవం కలుగు విధమున ప్రచారము గావించుచున్నారని గూడ నాకు తెలియవచ్చినది. రాష్ట్రములో శాంతికి భంగం కలగకుండా స్థానికాధికారులు అన్ని చర్యలూ తీసుకొందురని యీరుమూలమున అందరికీ నేను స్పష్టముచేయగోరుచున్నాను. ఏ జాతికి, ఏ మతమునకు, ఏ వర్గమునకు చెందినప్పటికీ అందరు తమ అభిప్రాయములను శాంతియుతముగా తోపకాశనం కాకుండా, శాంతికి భంగం కలుగజేయకుండా ప్రచారముచేయు హక్కుకలిగియున్నారు. దేశము మహా కష్టకాలములో నున్నది. వాతావరణము బొగ్గుల్లుముచే కలుషమైయున్నది. ఇట్టి పరిస్థితులలో, ఏ పేరనైనప్పటికి శాంతికి భంగము చేయు కార్యకలాపములకు ప్రభుత్వమువారెంతమాత్రము అనుమతింపజాలరు. ప్రత్యేకాంధ్రరాష్ట్రమును నిర్మింపవలెనని రాజ్యాంగపరిషత్తు యింకను నిర్ణయింపలేదు. ఆ నిర్ణయము జరిగిన యెడల, జరిగినప్పుడు పరిహద్దు నిర్ణయసంఘ మేర్పాటు చేయబడును. ఆ సంఘము వివిధ వర్గములవారు చెప్పుదానిని విని, వివిధ నివేదికలను పరిశీలించి నిర్ణయమునకు వచ్చును. బౌండరీ కమిషను నియామకము యింకను అనిశ్చితమైయుండగా ఆకమిషనువారిని తమకు అనుకూలురనుగా చేసికొనుటకుగాను ప్రజలను ఉద్రిక్తులను గావించి, వారిని అటో యిటో త్రిప్పుకొనుటకు సభలు యెందుకవసరమో, ఎట్లవసరమో నేను ఊహింపజాలకున్నాను. ఏది యెట్లున్నను, శాంతికి భంగముకల కార్యకలాపములను సాగించుటకుగాని, ఉపన్యాసములు గావించుటకుగాని ప్రభుత్వమువా రంగీకరింపరు. ఈ తగాదానుండి ఆదిమవాసులను వేరుగా నుంచవలెనని కోరుచున్నాను. వారిని రెచ్చగొట్టుట నిప్పుతో ఆటలాడుట యగును. ఇందుకు ప్రభుత్వమువారెంతమాత్రము అంగీకరింపరు." (ప్ర. ని)

### రైల్వే ఫెడరేషన్ సర్వసభ్య సమావేశం

మద్రాసు, సెప్టెంబరు 20. అఖిల భారత రైల్వే పనివారల ఫెడరేషన్, సర్వసభ్య సమావేశం ఈ నెల 30 వ తారీఖున లోగాక, బొంబైలో జరుగునుందని ప్రధాన కార్యదర్శి గురుస్వామిగారు ప్రకటిస్తున్నారు.

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణం

### పట్టాభిగారి ప్రకటన

చెన్నపట్నం, సెప్టెంబర్ 20. "ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై రాజ్యాంగపరిషత్తులో రెండు అభిప్రాయాలులేవు రామమనోహర్ లోహియావంటి స్నేహితులు, ప్రయోగించిన తీవ్రమై నటువంటి భాషవల్ల, మన ప్రశాంతత చెక్కు చెదరవలసిన అవసరంలేదు."

అని డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ఆంధ్రపత్రిక విలేఖరితో ముచ్చటిస్తూ ఈ ఉదయం ప్రకటించిరి. పట్టాభిగారు నిన్న సాయంత్రం ఢిల్లీనుంచివచ్చిరి 26 వ తేదీవరకు ఇక్కడ ఉంటారు.

పట్టాభిగారు తమ ప్రకటనలో ఇంకా ఇలా చెప్పిరి: భారత ప్రభుత్వ చట్టానికి అనుకరణగా తయారైన భారత స్వరాజ్యచట్టనిబంధనలలో ఆంధ్రరాష్ట్రానికి దగ్గరదారి యేర్పడింది. గవర్నర్ జనరల్ రాష్ట్ర ప్రభుత్వాన్ని సంప్రదించి, ఉన్న రాష్ట్రాన్ని విడదీయడానికి గాని క్రొత్తరాష్ట్రాన్ని నిర్మించడానికి గాని అధికారంయిస్తూ, భారతప్రభుత్వ చట్టాలోని 297 సెక్షన్ సవరింపబడింది. ఇప్పుడు కావాల్సిందేమంటే, కేంద్రప్రభుత్వంవారు దీనికి అంగీకరించవలసి ఉంది ఇందులో గూడా నాకేమీ చిక్కు కనిపించలేదు అయితే మద్రాసు ప్రభుత్వంవారే యిలా రాష్ట్రాన్ని విభజించాలని తీర్మానం చేయాలా, చేస్తే వారుదాన్ని అనుసరించి వారు చర్య తీసుకోవాలా, లేక కేంద్రప్రభుత్వంవారే తమకుతామే యీ విషయమై చర్య తీసుకోవాలా అన్నది మీ సూచన. రెండో మార్గమే యుక్తంగా యున్నట్లు తోస్తుంది. కేంద్రప్రభుత్వంవారు యీ విషయమై తగిన చర్య తీసుకోవడానికి మనం ఆందోళన చేయాలి.

రెండోమార్గం రాజ్యాంగ పరిషత్తులో తీర్మానం చేయించడం. అవిధంగా కేంద్ర ప్రభుత్వంవారు వెంటనే చర్య తీసుకొనేటట్లు చేయడం, ఇదిగూడా స్పష్టమైన మార్గమే. ఇందులోగూడ నాకు చిక్కు కన్పించడం లేదు. ఇటీవల జరుగుతున్న ఆందోళన అంతా రాబోయే జననానికి ముందు జరిపే సీమంతం పుంసవనం జాతకర్మలో విభాగంగా యెంచుకోవాలన్నది.

### సింహళమునకు సంపూర్ణ స్వాతంత్ర్యం

కొలంబో, సెప్టెంబరు 19: తదితర అధినివేశములవలెనే రానున్న ఫిబ్రవరిలోగా సింహళమునకు సామ్రాజ్యంనుండి విడిపోవుటకు సంపూర్ణహక్కు లభించునని మంత్రివర్గ అధ్యక్షుడు సేనానాయకే, ఒకసభలో ఉపన్యసిస్తూ చెప్పాడు. సింహళం శాసనసభలో పెద్దదైన సంయుక్త జాతీయపక్షమునకు ఈయన నాయకుడు. శాసనమంత్రివర్గమును ఏర్పరచవలసినదిగా ఈయనను ఈ నెలలో గవర్నరు ఆహ్వానించగా సెప్టెంబరు 24 వ తేదీన ఆహ్వానింపవచ్చునని తెలుస్తున్నది.

### ఆంధ్ర క్రైస్తవ కళాశాల విద్యార్థులసమ్మె

గుంటూరు, సెప్టెంబర్ 17: ఏప్రిల్ 1 హాస్టలు విద్యార్థులను క్రైస్తవ కళాశాల ప్రిన్సిపాలు తరువాత నిన్న ప్రైవేటు రామానుజంగారు అవమానపరిచారని, తదితర కారణములవల్ల విద్యార్థులు సమ్మెచేశారు. కానుపరీక్షలు వాయిదావేశారు. ప్రిన్సిపల్ డా॥ సైప్సుగారు "కళాశాలను" మూసివేస్తూ ఎక్కడికి కదలాల తెలవబడునో విద్యార్థులకు తెలియజేస్తామని నిన్న ప్రకటించారు. (ప్ర. ని)

### న్యూయార్కు దూది

న్యూయార్కు, సెప్టెంబరు 19: అక్టోబరు 32.02/32.02 డిసెంబరు 31.83/31.81 జనవరి 31.83/ మార్చి 31.83/31.81 మే 31.62/31.62 జూలై 31.00/31.00 అక్టోబరు 29.27/29.36 డిసెంబరు 28.95/ నా.

మిడ్లింగ్ - పోడరు

| | |
|---|---|
| అక్టోబరు (గరిష్ఠధర) | 32.46 |
| (కనిష్ఠధర) | 31.92 |

అక్టోబరు వాయిదా ధరలు

| | |
|---|---|
| సెటి ప్రారంభం వెల | 32.15 |
| ,, ముగింపు వెల | 32.02 |

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

టీ, కాఫీగింజలు సప్లైచేయుటకు టెండరు.

ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే గ్రెయిన్ షాపులకు 1947 అక్టోబరులో బి. ఓ. పి. కి తక్కువకాని రకము టీ ఆకు, కాఫీ గింజలు సప్లైచేయుటకు దిగువ చెప్పినవిధంగా సూపర్ స్క్రైబ్ చేసి, సీల్డుకవర్లలో టెండర్లు డిప్యూటీ జనరల్ మానేజరు (గ్రెయిన్ షాప్సు) వారికి 26-9-1947 తేది సాయంత్రం 8 గంటలలోపుగా పంపవలెను.

కావలసిన మొత్తం సరుకు క్రింద చూపబడినది

| సరుకు | కావలసిన మొత్తము | చెల్లించవలసిన ధరావతు సొమ్ము | టెండరు కవరుమీద వ్రాయవలసినది |
| --- | --- | --- | --- |
| టీ ఆకు బి. ఓ. పి. కి తక్కువకానిరకము | 70,000 పౌనులు | రు. 1,500/- | GS/OR/III/52/80 |
| కాఫీగింజలు | 20 టన్నులు | రు. 500/- | GS/OR/51/IV |

ప్రతి సరుకుకు టెండర్లు విడి విడిగా నిర్ణీతఫారములలో పంపవలెను. టెండరు ఫారం కాపీ ఖరీదు రు. 1/- ఈ సొమ్ము మద్రాసు, పార్కు టౌనులోని యీ రైల్వే పే-మాస్టర్ అండ్ కాషియర్ గారికి చెల్లించవలెను. టెండరు ఫారము ఖరీదు క్రింద పంపు మనీఆర్డరుగాని పోస్టల్ ఆర్డరుగాని, ఈ రైల్వే పే-మాస్టర్ అండ్ కాషియర్ గారి అడ్రసుకు పంపవలెను.

టెండరు ఫారము ఖరీదు క్రింద చెల్లించిన సొమ్ముకు పే-మాస్టర్ అండ్ కాషియరు గారివల్ల యివ్వబడే రశీదును దిగువ సంతకముదారు ఆఫీసులో చూపించి, సప్లయికి సంబంధించిన షరతులు నిబంధనలతో సహా టెండరు ఫారములను పొందవచ్చును. టెండరు ఫారము ఒకరిది మరియొకరు మార్చుకొనగూడదు. దానిఖరీదు వాపసుచేయబడదు.

Madras, 17-9-47.

DY. GENERAL MANAGER, (Grain Shops)





# వార ఫలాలు

శ్రీ రావినూతల ఆంజనేయులు

[లగ్న ఫలములను జన్మలగ్న, చంద్ర (గోచార) లగ్నములననుసరించి గ్రహించునది. దశాభుక్తుల ననుసరించి ఫలితములు మారవచ్చును. కాన పరమ ప్రమాణములుగా ఎంచరాదు.]

### సెప్టెంబరు వ 21 తేదీ మొదలు 27 వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి, శుక్రులూ – 26 వరకు బుధుడూ (కన్య) కుజశనులు (కటకం) గురువు (వృశ్చికం) రాహువు (వృషభం) చంద్రుడు (వృశ్చిక ధనుర్మకరకుంభాల్లో) 21 శనిచంద్ర కోణం. 24 కుజచంద్ర (సమసప్తకం). 25 గురుకేతు (కలయిక) 26 శని చంద్ర (సమసప్తకం) 27 రాహు,గురు చంద్ర (కేంద్రం) 25 రవిచంద్ర (కోణం).

### ధరలు

**ప్రత్తి(జౌళిల్లా) నూలూ-వస్త్రాలూ**

ప్రత్తిస్పెక్యులేషన్ ప్రథమంలో నిలకడగా యుండి శుక్రుని హస్తానక్షత్ర సంచారంలో క్రమేణా తగ్గుతుంది. 26, 27, ల్లో, మార్కెట్టు ఎక్కువగా తగ్గవచ్చు.

**వెండి-బంగారాలు**

మార్కెట్టు అస్థిరము. 24 క్రీఅమ్మ 26 కొనడం లాభకరం.

**వాటాలు**

టాటాడెఫర్డు, బొంబాయి రంగులు మందీకేగం తగ్గుతుంది. సిమెంటు, నూలు, రబ్బరు వాటాలు కొంత హెచ్చుతవి.

**ధాన్యములు-ఆహారవస్తువులు**

పొట్టుధాన్యములు స్వల్పముగా హెచ్చుతవి. పప్పులూ, నూనెలూ, (వేరుశనగ అవిశె ఆముదాలూ) కొద్దిగా హెచ్చును. పసుపూ, దుంపకూరలూ కొంచెము తగ్గును.

**వర్షము**

24, 25, 26, 27 తేదులలో దక్షిణ జిల్లాలలో సామాన్యవృష్టి.

### లగ్న ఫలాలు

**మేషం (అశ్వని, భరణి,కృత్తిక 1 పాదం)**

ఈ వారంలో మీ వృత్తి ఉద్యమాలలో ఆటంకాలు ఉండకపోవు, కాని ఉత్సాహంతో మీ బుద్ధి చాతుర్యాన్ని వినియోగించుకొని ముందుకు పోగలుగుతారు. కుజశనులు ఏకరాశి సంచారం, ఆరోగ్యభంగం కలిగించే సూచనలున్నవి. ఉద్యోగనౌకరీల్లో, మీ పట్టుదలే నెగ్గుతుంది. మొత్తం మీద స్వశక్తితో, మిత్ర సహాయంతో వ్యాపార పరిష్కారాదుల్లో మీ పట్టుదలే నెగ్గుతుంది. 20, 23, 24 పరిష్కారాలకూ 24, 25, 26 ప్రయాణానికీ ముఖ్యులను కలవడానికి మంచిది.

**వృషభం (కృత్తిక 2, 3, 4, రోహిణి మృగశిర 1 2 పాదాలు)**

ఈ వారంలో కుజరాశిచలనం ఇంతవరకూ, అశాంతిగా సాగుతున్న పరిస్థితులను కొంత తగ్గించకలదు. కొరగాని కర్చులు కూడా తిగ్గుతవి. దేహారోగ్యంకూడా మేలుగాయుంటుంది. ఉద్యోగ నౌకరీల్లో అధికారులవల్ల అభిమానం పొందగల్గుతారు. సత్పురుషుల సహవాసం త్వరలో లభించే సూచనలున్నవి. వారాంతంలో పరిష్కారాలూ ప్రయాణం లాభకరం. 21 శుభవార్త. 27 అప్రసమాగమం.

**మిథునం (మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)**

ఈవారంలో మీరు (ముఖ్యముగా రుద్రా నక్షత్రంవారు) ఆరోగ్యం విషయమై జాగ్రత్తపడడం అవసరం. గురువు దూరం అవటంవల్ల యింటి వ్యవహారాలూ శుభకార్యప్రస్తావనలూ వెనుకపడుతవి. ఉద్యోగ నౌకరీల్లో శ్రమాధిక్యతవు పైవారి ప్రతికూలతలూ వీలుంటుంది. కుజదశ, కుజభుక్తులు జరిగేవారు తగు శాంతి జరుపుకొనడం మంచిది. 21, పరిష్కారాలకూ, 22, 23, 24 ప్రయాణానికీ అనుకూలం.

**కర్కాటకం (పునర్వసు 4, పుష్యమి, ఆశ్లేష)**

ఈవారంలో యితర గ్రహసంచారం కొంత అనుకూలంగా యున్నా లగ్నంలో కుజశనుల స్థితి, కొంత నిరుత్సాహం కలిగించే సూచనలున్నవి. ధనవ్యయం, ఆరోగ్యభంగం, ఋణదాతలవల్ల చిక్కులూ, మనోజుగుప్స కలిగించకలవు. చిక్కులలో ఆదుకొనే ఆప్తులు కూడా నిర్లక్ష్యంగా వర్తిస్తారు. ప్రఫలితంలేని త్రిప్పట అధికం అవుతుంది. శని దశాభుక్తులూ కుజదశాభుక్తులూ జరిగేవారు పుష్యమి నక్షత్రం వారూ తగు శాంతి జరుపుకొనడం ఉత్తమం. 22 శుభవార్త.

**సింహం (మఖ,పుబ్బ,ఉత్తర 1వ పాదం)**

ఈ వారంలో ఇరుప్రక్కలా గ్రహబలం మిశ్రమఫలితాన్ని కలిగిస్తుంది. సమయమునకు తగిన ధనాదాయం సహాయం కలగకుంచేత కుటుంబచిక్కులు తొలగిపోతవి. ఉద్యోగవ్యాపారాదుల్లో కూడా మీరు అనుకొనినవి సాధించకల్గుతారు. కాని ఇతరుల వ్యవహారాల్లో జోక్యంకలిగించుకొనడంవల్ల అపవాదం, గౌరవభంగం కలిగే సూచనలున్నవి. ఆరోగ్యం గతవారంకన్న మేలుగా యుంటుంది. 24,25,26 పరిష్కారాలకూ 27, ప్రయాణానికీ అనుకూలం.

**కన్య (ఉత్తర 2, 3, 4 పాదాలు హస్త చిత్త 1, 2 పాదాలు)**

ఈ వారంలో పైకి అన్నీ అనుకూలంగానే అగపడుతవి. కాని మనస్సులో అశాంతి హెచ్చుతుంది. ఇతరులు కలిగించే ఆశలు నమ్మడం ఈ అశాంతికి కారణం. వ్యాపారాదుల్లో క్రొత్త చిక్కులు కలగడం, రావలసిన డబ్బు రాకపోవడం జరుగుతుంది. వాతాధిక్యత మలబద్ధకం అగపడుతవి. గురుచింత దైవచింత మేలుకలిగించకలవు. సంఘంలో మర్యాద హెచ్చుతుంది. 21, 27 పరిష్కారాలకు అనుకూలం, ప్రయాణం అగుతుంది.

**తుల (చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పాదాలు)**

ఈ వారంలో శుభగ్రహులు రాజ్యంలో నూతన ఉత్సాహంతో మీ కార్యాలను జరుపుటకు అవకాశం ఇస్తారు. ఏఫలితంకొరకై ఎదురుచూచుచున్నారో అది ఫలించే అవకాశాలు త్వరలో స్పష్టంగా అగపడుతున్నవి. ఏ వ్యవహారంలోనూ అపజయం యుండదు. స్థిరాస్తి ఆర్జన ప్రయత్నాలు మాత్రం సాగే సూచనలు లేవు. స్వాతి నక్షత్రంవారు ఉద్యోగ నౌకరీల్లో అత్యంత జాగ్రత్తతో నడచుకొనడం అవసరం. సంఘంలో గౌరవం పెరుగుతుంది. 22, 23, 24 మధ్యాహ్నం వరకూ ముఖ్య పరిష్కారాలూ వృత్తి ఉద్యమాల్లో ముఖ్య కార్యక్రమం ముగించుకోవడం మంచిది.

**వృశ్చికం (విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ఈ వారంలో ఒకటి రెండు మాసాలుగా ఆగిపోయిన వ్యవహారాలను ఉత్సాహంతో చాలవరకు ముగించ కలుగుతారు. దేహారోగ్యంకూడ గతవారంకన్న మేలుగా యుంటుంది. మునుపెప్పుడో మేలుపడుదము అను ఆశలు కనపడుతవి. కాని అవి దూరంగానే ఉంటవి. ఉద్యోగ నౌకరీల్లో అధికారులవల్ల కొంత మేలు కలుగును. స్థిరాస్తి వ్యవహారాలుకూడా అనుకూల పరిష్కారానికివచ్చే వీలున్నది. 21 ప్రయాణానికి, 25, 26 పరిష్కారానికి అనుకూలం. 27 మిత్రులతో అకారణ కలహం.

**ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)**

ఈ వారంలో రాజ్యంలో గ్రహబలం కొంత ఉత్సాహాన్ని ప్రోత్సాహాన్ని కల్గించకలదు. ఆరోగ్యంకూడా గతవారంలో కన్న మేలు కన్పడుతుంది. స్థిరాస్తి పరిష్కారాలూ, కుటుంబ వ్యవహారాలూ, ఒకమిత్రుని సహాయంవల్ల అనుకూలమార్గంలోకి రాగలవు. దైవచింత, భక్తి, అభివృద్ధి అవుతవి. ఇతరుల వ్యవహారాల్లో ప్రవేశించక దూరంగాయుండాలి. 22, 23 ప్రయాణానికీ, 27 పరిష్కారాలకూ అనుకూలం 24 శుభవార్త.

**మకరం (ఉత్తరాషాఢ, 2,3,4 పాదాలు శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు.)**

ఈ వారంలో సప్తమంలో క్రూరబలం మీ ప్రయత్నాలకు ఆటంకం కల్గించకలదు. ఆరోగ్యంలో ఒకదినంఅనుకూలము, మరొకదినం ప్రతికూలంగా యుంటుంది. అప్పు చేయవలసిన అవసరం కలుగుతుంది. శరీరానికి మనస్సుకు శ్రమకల్గించే పనులలో ప్రవేశించవద్దు. ఇతరుల సహాయానికై బాధ్యతతోకూడిన పనులను పైనవేసుకుంటారు. 21 పరిష్కారాలకూ 25, 26 ప్రయాణానికీ అనుకూలం. 25 శుభవార్త.

**కుంభం (ధనిష్ఠ 3, 4 పాదాలు శతభిష, పూర్వాభాద్ర 1, 2, 3, పాదాలు)**

ఈ వారంలో గ్రహస్థితి వృత్తి ఉద్యమాల్లో తప్పుమార్గం చూపించి ఆరాటంగం కల్గించే సూచనలున్నవి. ఆరోగ్యం గతవారంకన్న మేలుగా యుంటుంది. స్థిరాస్తి సంపాదన ప్రయత్నాలు కూడా అనుకూలంగా సాగుతవి. పేకాటలు, స్పెక్యులేషన్ లాభించవు. దేహసౌఖ్యం కొంత తగ్గుతుంది. 21,27 ప్రయాణానికీ 22,23 పరిష్కారాలకు అనుకూలం. 25, ధననష్టం. 26 మిత్ర విరోధం.

**మీనం (పూర్వాభాద్ర, 4 వ పాదం ఉత్తరభాద్ర, రేవతి)**

ఈ వారంలో పంచమ భాగ్యాల్లో గ్రహబలం విశ్రాంతితో మీ లోపాలను విమర్శించుకొనుటకు అనుకూలం కల్గిస్తుంది. గురుబలం లభించదగా అని ఏ వ్యాపార వ్యవహారాల్లో ప్రవేశించినా, నష్టం కలగడం, తగవులు పెరగడం కలుగుతుంది. కుటుంబ ఆర్థిక పరిస్థితులలో చిక్కులు హెచ్చే సూచనలున్నవి. మిత్రులు ఆదుకొనడంవల్ల సర్దుకోగల్గుతారు. 21 ప్రయాణానికి తర్వాత 24 మధ్యాహ్నంవరకూ పరిష్కారాలకూ అనుకూలం. 24 శుభవార్త.

# ప్రపంచ సమీక్ష

(3-వ పేజీ తరువాయి)

భేదాలు అప్పుడు లేకపోయినా మొత్తం మీద మాత్రం ఇప్పటి మాదిరిగానే కొన్ని దేశాలు సంపూర్ణంగా నానా జాతి సమితిని స్వప్రయోజనం కోసరం ఉపయోగించుకోవడం, మరి కొన్ని దేశాలు నానాజాతి సమితినే నమ్ముకొని ఉంటం జరిగింది. నమ్ముకున్న వారిని చివరికి నట్టేట్లో వదిలేశారు. అబిసీనియా, చైనా, ఆస్ట్రియా, చెకొస్లవేకియాలు సమితి అసమర్థతవల్లనే పరాధీన దేశాలైపోయి చివరికి పూర్తి విముక్తి మరో మహాసంగ్రామం ద్వారా గాని వీటికి సంప్రాప్తం కాలేదు.

ఒక్క ఇండోనేసియా విషయంలో మాత్రం ఉభయపక్షాలకూ ఒక ఆదేశాన్నివ్వడం ఆస్ట్రేలియా, బెల్జియం, అమెరికాలతో ఒక మధ్యవర్తిసంఘాన్నేర్పాటు చేయుడం జరిగింది. ఇందువల్ల ఆ సమస్య పరిష్కార మవుతుందా అంటే కాదనే చెప్పాలి. ఐక్య రాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో భారత ప్రతినిధివర్గ నాయకురాలు శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ఉద్ఘాటించినట్లు ఈ ఇండోనేసియా సమస్యాపరిష్కారంపైనే ఆఖిలాసియా భవిష్యత్తూ ఆధారపడిఉంది. ఈ మధ్యవర్తి సంఘం తీర్పును ఇండోనేసియా హాలెండ్ లు ఎంతవరకు అంగీకరించునో ఇప్పుడు చెప్పలేము. ఫ్రాన్సు ఇండో-చైనా విధానమూ ఇలాగేఉంది. "కీలుబొమ్మ" ప్రభుత్వాన్ని నెలకొల్పి జాతీయోద్యమాన్ని అణచివేయుడానికి ప్రయత్నిస్తున్నది. ఏవో సంస్కరణలను ప్రకటించింది.

ఫ్రాన్సు, హాలెండ్ దేశాల సామ్రాజ్య విధానం, దీనికి బ్రిటన్, అమెరికాల మద్దతు రష్యాకు మంచి వీలుగా ఉంది. పరాధీన దేశాల సంరక్షక బాధ్యతను వహించిన ఖ్యాతిని సంపాదించకలిగింది. ఈవిధంగా పరాధీన ప్రపంచ నాయకత్వం రష్యాకు లభించింది. దీన్ని ఆధారంగా తీసుకొని, రష్యా తన అపేక్షల సాధనకు ప్రయత్నాలు సాగిస్తున్నది. పశ్చిమాసియా ఆధిపత్యం సంపాదించాలని, పశ్చిమాసియాలోని నూనెగనులు మరో దేశానికి సంక్రమించకుండా చేయాలని విశ్వప్రయత్నం చేస్తున్నది. సామదానభేదదండోపాయాలను ప్రయోగించింది. మొన్నటివరకూ సోవియట్ పక్షపాతిగానున్న ప్రధాని ఘవాం సుల్తానే ఈనాడు తాను చేసుకున్న ఒప్పందాన్నే త్రోసిరాజంటున్నాడు. బ్రిటన్, అమెరికాలు సుల్తానేను ప్రోత్సహిస్తున్నవి.

## బ్రిటన్ స్థాయి

బ్రిటన్, ఇండియా, బర్మా, సింహళముల నుండి బయట పడ్డట్టే ఈజిప్టు నుండి కూడా బయటపడ గలిగితే, పాలస్తీనా సమస్యను ఏదోవిధంగా పరిష్కరించ కలిగితే బ్రిటన్ అంతర్జాతీయ చిక్కులనుంచి ఒక విధంగా బయట పడగలదు. అప్పుడు ఒక స్వతంత్ర దేశాంగ విదేశాంగ విధానాన్ని అనుసరింప వీలవుతుంది. ప్రస్తుతం అమెరికాకు వంత పలకడంకంటే బ్రిటన్ చేయగలిగిందేమీ లేదు. 1917 నుంచి 1924 వరకూ రష్యాను ఆర్థికంగా సాంఘికంగా బహిష్కరించి నానా యాతనలూ పెట్టింది ధనిక ప్రపంచం. అది నియంతృత్వ ప్రభుత్వ పరిపాలనలో ఉంది గనుక కావాల్సినంత అంగబలం, ప్రకృతి సంపద ఉంది కనుక ఏ కొంత గానైనా రష్యా తట్టుకోకలిగింది. అంతటి రాజకీయాధికారాలు బ్రిటిషు కార్మిక ప్రభుత్వానికి లేవు. అంతటి సహజ సంపత్తి లేదు. కనుకనే జంకుగొంకులతో వ్యవహరిస్తున్నది. సర్ స్టాఫర్డ్ క్రిప్సు ఎగుమతులను వృద్ధి చేయడానికి బ్రహ్మాండమైన పథకాన్ని తయారుచేశారు. డాల్టన్ డాలర్లను నిలవచేయడానికి పొదుపుగా వాడడానికి ఒక శాసనం చేశారు.

## స్వయంకృతాపరాధం

అయితే ఇదంతా స్వయంకృతాపరాధమే అనీ, అట్లీ ప్రభుత్వ తటపటాయింపే నేటి ఆర్థిక సంక్షోభానికి కారణం అనీ కమ్యూనిస్టులు ఆడిపోస్తున్నారు. వచ్చిన చిక్కేమిటంటే యూరోపు మార్కెట్లో ఆర్థిక విధానాన్ని అనుసరించడానికి బ్రిటిషు ప్రభుత్వానికి మనస్కరించడం లేదు. పూర్తిగా సోషలిస్టు ఆర్థికవిధానాన్ని అమలుచేయడానికి ధైర్యంలేదు. మధ్యే మార్గాన్ని అనుసరించడంవల్ల అసలు సమస్యా పరిష్కారం కావడంలేదు; ఏ వర్గమూ సంతృప్తి చెందడంలేదు. అందరూ అసంతృప్తులుగానున్నారు. ఈ అనిర్ణయ సందిగ్ధావస్థనుండి బయటపడితేనే ఏమైనా మోక్షం ఉంటుంది.

మేఘావృతమై అంధకారబంధురమైన అంతర్జాతీయ రాజకీయ ప్రపంచంలో క్రొత్త ఆశారేఖగా కన్పిస్తున్నది జర్మనీ ఆశ్రిత రాజ్యాలతోటి చేసుకొన్న సంధి ఒడంబడికలను రష్యాతో సహా అన్ని దేశాలూ ఆమోదించినవి. కాని అసలుసమస్య-జర్మనీ, జపాన్, భవిష్యత్తు-ఇంతవరకూ ఎటూ తేలకుండానే ఉండిపోయింది.







### నోటీసు

ఏలూరు డిస్ట్రిక్టు కోర్టులో

O. S. 23/1947. I. A. 838/1947.

పిటీషనరు & వాది: గారపాటి కృష్ణయ్య సాకిన్ రాజు పేట

రెస్పాండెంట్సు & ప్రతివాదులు: 1. పోరుగంటి వెంకటచలం, 2. జలసూత్రం సూర్యనారాయణమూర్తి, 3. యీ ఆదినారాయణమూర్తి, 4. యీ పశ్చిమ గోదావరి డి॥ అఫిషియలు రిశీవరుగారు.

వాయిదా 30—9—47.

ఈ నెంబరు ప్రతివాదులు పైరవాది Representative Capacity లో యీ దావా తెచ్చుటకు Permit యిప్పించవలెనని మొదలయిన సంగతులతో వాది పిటీషను దాఖలు చేసియున్నారు. ఇందుకు ఆక్షేపణ లున్నయెడల కోర్టువారితో మనవి చేసుకోవలెనని యిందుమూలముగా తెలియపరచనమైనది.

సం॥ బొ॥ సూర్యరావు,

16-9-47. వాది తరఫు అడ్వొకేటు.

### నోటీసు

బెజవాడ సబ్ కోర్టులో

S C 156/47.

వాది: డివాకరుని సాంబశివరావు.

ప్రతివాద్లు: కొలి సుబ్బానాయుడు వగైరా.

పై నెంబరున వాదికి ప్రతివాదులవల్ల రావలసిన ఖాతాబాకీ రు375/8 లు రాబట్టుకొనుటకు దావా దాఖలుచేయగా ప్రతివాదులకు నోటీసు నిమిత్తము 29-9-47 తేదికి వాయిదా వేయబడినది. ఇందునుగురించి ప్రతివాదులకు గల ఆక్షేపణలు వాయిదా కోజున కోర్టువారితో మనవి చేసుకోవలెను.

ఎం. పున్నయ్య,

వాది తరఫు వకీలు.



### వేలము నోటీసు

విజయనగరము మునిసిపాలిటీ

ఇందుమూలముగా సర్వులకు తెలుపునది ఏమనగా, సంతపేట పొతు వాడ T S. No. 14 నెంబరులో యున్న ఒక్కొక్కటి సుమారు 45 అడుగుల వెడల్పు, 90 అడుగులు పొడవు గలిగిన రెండు ఇండ్ల స్థలములు 22-9-47 తేదిని ఉదయము 9 గంటలకు విజయనగరము మునిసిపల్ ఆఫీసువద్ద బహిరంగముగా వేలము వేయబడును. గాన కావలసినవారు వేలమునకు హాజరుఅయి పాడుకొనవచ్చును.

మహమద్ మేడి హుస్సేను,

15-9-47. మునిసిపల్ కమీషనర్, మునిసిపల్ ఆఫీసు, విజయనగరం.

### బహుమతి

నా తాలూకు జనరల్ స్టాంపులు 3-9-1947 తేదిన గన్నవరం నుంచి సాయంత్రం కారులో వీరంకి లాకుకు వచ్చుచుండగా త్రోవలో జారిపడిపోయినవి. దొరికినవారు నాకు తెలిపిన తగ్గ్యనుసారం పారితోషిక మివ్వబడును.

కె. వి. సుబ్బారావు,

స్టాంపువెండరు, వీరంకిలాకు.

### వేలము అమ్మకము

మద్రాసు, ఆవడిలోని వెహికిల్సు డిపోవద్ద పెద్ద మొత్తములలో మిగిలిపోయిన ఫోర్డు, షెవర్లెట్, డాడ్జి, స్టుడిబేకర్ వెహికిల్సు, వర్కుషాప్, జనరేటర్, వైర్లెస్, పాన్ట్రూన్, ఇతర టెక్నికల్ లారీలు, ట్రెయిలర్లు, మోటారు సైకిళ్లు వగైరా సెప్టెంబరు 29, 30 తేదీలలో ఉదయము 10 గంటలకే వేలం వేయబడును.

మురేస్.

